# భారత నారి
## నాడూ-నేడూ



ఇల్లిందల సరస్వతీ దేవి





# భారతనారి నాడూ-నేడూ

రచయిత్రి :

## ఇల్లిందల సరస్వతీదేవి

ప్రచురణ :



యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3

# BHARATHA NARI, NADOO-NEDOO

By Illindala Saraswathi Devi.



యువభారతి

ప్రచురణ : 38

ప్రథమ ముద్రణ : ప్రతులు 2,200

14 డిసెంబరు, 1975



ముఖచిత్ర రచన :

శీలా వీర్రాజు



ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :

విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

వెల : 1-00

---

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
/AS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDI
AT CONCESSIONAL RATES
YUVABHARATHI IS GRATEFUL

---



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమాణాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరిసరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 87 ప్రచురణలను ప్రచురించి రెండులక్షల ఇరవైఐదువేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువవెలకు తెలుగుపాఠకులకు అందించడానికి పూనుకున్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 8,500 మంది ...హితీ మిత్రులుగా చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10వేలకు ...దుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత ...విత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికిపైగా భారతీమిత్రులుగా, ...మాభై మంది భారతీ భూషణులుగా చేరారు. ఈ పథకాలలో సభ్యులుగా ...రి మా "నందిని" మాసపత్రికను ఉచితంగాపొందే అవకాశం కల్పించుకో... లసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యక... ...ల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేక అంశాలుంటాయి...

మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్య... ...ంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

14-12-75



# మా మాట

ఆలోచనలు అందరికీ రావచ్చు. తన ఆలోచనలు అందరికీఅందా లని ప్రతివ్యక్తీ ఆకాంక్షిస్తాడు. ఇది సహజం. కాని తమ ఆలోచనలను స్పష్టంగా అందరికీ తెలుపగలిగే నేర్పు అందరికీ ఉండదు. ఆలోచనలు అనేకాకృతులను దాల్చవచ్చు. చిత్రంగా రూపొందవచ్చు. శిల్పంగా కని పించవచ్చు, స్వరబద్ధం కావచ్చు. ఉపన్యాసం కావచ్చు.ముచ్చటకావచ్చు, కవితగా సాక్షాత్కరించవచ్చు, నాట్యంగా అవతరించవచ్చు, ఆలోచనల ఇన్ని రూపాల్లో వ్యక్తంగావడానికి కారణం మానవుల్లో జన్మతః అబ్బిన ప్రతిభా వైవిధ్యం ఉత్తమ భావప్రసరణానికి రకరకాల ప్రతిభలు తోడ్ప డుతూ ఉంటాయి. ఈ కళారూపాలన్నింటిలో •సాహిత్యానికున్న విస్తృతి ఇతరమైన వాటికి లేదు. వాఙ్మయాన్ని అవగాహన చేసుకోవడానికి వ్రాయనూ, చదువనూ, వస్తేచాలు. ఇతర కళలను చూచి ఆనందించగలరే కాని, ఆ ఆనందాన్ని ఆధారంగా చేసుకొని తనఆలోచనలకు పదును పెట్టు కోలేడు. వృద్ధి చేసుకోలేడు. సారవంతం చేసుకోలేడు.

వైజ్ఞానిక, సాంకేతిక రంగాలు ఇటీవల మానవుని మనస్తత్వాన్ని జీవన విధానాన్ని ప్రత్యక్షంగానో. పరోక్షంగానో ప్రభావితం చేస్తు ఉన్నవి. ఆలోచనల ప్రసారణంలో ఎన్నడూ లేనన్ని అవకాశాలు ఇతోధి కంగా లభిస్తున్నవి. రేడియో, టెలివిజన్, సినిమా, వార్తాపత్రికలు ఇత్యాది ప్రచార సాధనాల ప్రభావం ఒక ఎత్తు. పుస్తకాలు ఒక ఎత్తు. పుస్తకాల చదవడానికి, చెప్పడానికి, ఎప్పుడు పడితే అప్పుడు చూసుకోవడానికి ఉపయోగపడేసాధనాలు. కనుక ఇతర ప్రచారసాధనాలకంటె పుస్తకాని కున్న విస్తృతి అనన్యసామాన్యం. అయితే ఈ పుస్తకాలు అందుబాటులో

ఉండే తీరునుబట్టి, అవి అందించే ఆలోచనలను బట్టి ప్రాముఖ్యాన్ని సంత రించుకుంటాయి. ప్రజాహిత సంస్థలు, ప్రభుత్వం, మత సంస్థలు తమ కార్యకలాపాలకు సిద్ధాంతాలకు సంబంధించిన అనేక కాంశాలను ఉచితంగా ప్రజాబాహుళ్యాని కందించే ప్రయత్నాన్ని మనం చూస్తూనే ఉన్నాము. కాని అందరి ఆలోచనలు అచ్చుపోసుకుని అందరికీ అందుబాటులోనికిరావ డానికి ఎన్నో అవస్థలను ఎదుర్కొవలసి ఉంటుంది. సాధ్యమైనంత తక్కువ వెలకు ఉత్తమసాహిత్యాన్ని అందించే ఉద్యమంపట్ల యువభారతి కున్న విశ్వాసమే వివిధ పుస్తకాలను ప్రచురించేందుకు తోడ్పడుతున్నది. ఒకే ఒక్క రూపాయికి సమాజానికి మార్గదర్శనం చేయగలిగే భావాలను వివిధ సమస్యల స్వరూపస్వభావాలను పరిచయం చేయాలనే మాఉద్దేశ్యం ఓ రూపుదాల్చి ఈ విధంగా పఠితృలోకంలోకి ప్రవేశిస్తున్నది మా లహరీ పరంపరలో వెలువడుతున్న ఉపన్యాసమంజరులు, సాహితీవాహిని పరం పరలు, కవిత, కథానికా సంకలనాలు, వ్యాసకదంబాలతో పాటు ఈ రూపాయి పుస్తకప్రచురణం మరో సోపానం. దైనందిన జీవితంలో ఎదు రయ్యే సమ్యసలు ఆహారం-ఆరోగ్యం-పిల్లల శిక్షణ-మనస్తత్వం- ఆర్థిక సాంఘిక సమస్యలు-రచయితల, పాఠకుల సమస్యలు, సాంకేతిక-వైజ్ఞా నిక రంగాల అన్వేషణ ఫలితంగా సమాజంలో రూపుదిద్దుకుంటున్న తీగ తెన్నులు, యువకుల, వృద్ధులసమస్యలు ఇత్యాది విషయాలపై విజ్ఞుల సరళమైన భాషలో పుస్తకాలు వ్రాయించి ఒకేఒక్క రూపాయికి అంద చేయాలని మా ఉద్దేశ్యం.

ఈ మా ఉద్దేశ్యాన్ని సహృదయంతో అర్థం చేసుకుని, మా ఉద్య మానికి ప్రప్రథమంగా ఆశీస్సహకారాలను అందించి మమ్మల్ని ప్రోత్స హించిన విదుషీమణులు శ్రీమతి ఇల్లిందల సర్వసతీదేవి గారు. కథ, నవల, వ్యాసరచయిత్రిగా శ్రీమతి సరస్వతీదేవి గారు పఠితృలోకానికి చిరపరిచి తులు. "వనితాలోకం" అనే వ్యాస కదంబం ఈమె బహుముఖీన ప్రజ్ఞా పాటవాలకు, సుస్పష్టమైన భావప్రకటనకు, అందమైన వచనరచనకు

మణిదర్పణం. ఈవ్యాసాలు యువభారతిసభ్యులలో పఠనాసక్తిని,నిర్మాణా దృక్పథాన్ని ఇనుమడింపజేసిన వనడంలో అత్యుక్తిలేదని చెప్పవచ్చు.

భారతనారి, నాడూ-నేడూ అనే ఈ సుదీర్ఘవ్యాసం సమన్వయ ధోరణి నిర్మాణాత్మక దృక్పథానికి, విశిష్టమైన ఆలోచనాపద్ధతికి, ఉదాత్తమై హృదయసంస్కారానికి నిదర్శనంగా ఉన్నది. "స్త్రీపుంసయోగోద్భవ" మై ఈజగత్తును అర్థం చేసుకుని సుఖమయంగానూ,రసమయంగానూ రూపొ దించుకోవడానికి మానవులుద్యమించాలి. అంతే కాని స్త్రీలదుస్థితికిపురుషు కారణమనీ, పురుషుల దుస్థితికి స్త్రీలే కారణమనే నిర్హేతుకమైన ఉద్వేగప పూరితమైన వివాదాలవల్ల లబ్ధిలేదనే యాదార్థ్యాన్ని ఈ వ్యాసం నిరూపి పిస్తున్నది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారి సహకారభావాని యువభారతిపట్ల ఆమెకున్న వాత్సల్యానికి మా అభివందనాలు.కృతజ్ఞతలు.

ఈ పుస్తకాల రూపకల్పనలో మాకు చేదోడుగా ఉండి సముచి మార్గదర్శనం చేస్తున్న మాప్రధాన సంపాదకులు డా॥జి.వి. సుబ్రహ్మణ్య గారికి ధన్యవాదాలు, భావస్ఫోరకంగా ముఖచిత్రాన్ని తీర్చిదిద్దియిచ్చి ప్రసిద్ధకళాకారులు శ్రీ శీలా|వీరాజు గారికి మా హృదయ పూర్వకమై నమస్సులు సమర్పించుకుంటున్నాము.

ముఖచిత్రాన్ని అందంగా ముద్రించిన న్యూ విస్టాస్ ప్రింటం వారికి, పుస్తకాన్ని అచ్చువోసిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్ అధినేత శ్రీ ఎన్.వి. నారాయణ గారికి నమస్సులు.

మాకు అచ్చు ప్రతులను సరిచూడడంలో సహకరించిన శ్రీ నిడ వోలు సుందరేశ్వర రావు గారికి మా కృతజ్ఞతలు.

ఈ వరుసలో వస్తున్న చిన్నచిన్న పుస్తకాలను సమాదరించి మా ఇతోధిక ప్రోత్సాహాన్ని తెలుగు ప్రజలు అందిస్తారని ఆశిస్తున్నాము సహృదయుల ఆర్థిక, హార్దిక సహకారాన్ని అర్థిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

14-12-75

# భారతనారి నాడూ-నేడూ

సంఘంలో మనుగడ సాగించే ప్రతివ్యక్తికీ ఒకస్థాయిలో గౌరవ
ప్రతిపత్తి ఉంటుంది. అది ఆ వ్యక్తి ఆక్రమించిన స్థానాన్నిబట్టీ, నిర్వ
హించే పాత్రనుబట్టీ ఉంటుంది.

ప్రకృతి సృష్టించిన స్త్రీ, పురుషులు ఒకరికొకరు ఆకర్షితులై తిరిగి
సృష్టికి తోడ్పడుతున్నారనే విషయము సాక్ష్యమక్కరలేని సత్యము.
సహజీవన బాధ్యతలను సమానంగా పంచుకుని, జంటగా జీవనయాత్ర
సాగిస్తూ, సృష్టికి తోడ్పడే స్త్రీ పురుషులలో ఎవరధికులు? ఎవరు ప్రధా
నులు? ఈ ప్రశ్నలు బహుశః వారి పుట్టుకతో జన్మించి, క్రమాగతంగా
బలాన్ని పుంజుకుని ఈనాటివరకూ శేషప్రశ్నగానే నిలిచాయి.

"పురుషుడే అధికుడు" అన్నవాదాన్ని సృష్టించి బృహదారణ్య
కోపనిషత్తు దానికి బలాన్ని చేకూర్చింది. సృష్టిలో పురుషుడు ప్రధానుడే కాక-
ప్రథముడు. ముందుగా ప్రజాపతి ఒక్కడే సృష్టింపబడటంచేత ఒంటరిగా
బ్రతకలేక-తనజీవితాన్ని సుఖమయం చేసుకోవటానికి అతడు తనదేహాన్ని
రెండు ఖండాలుగా చేసుకున్నాడు. ఆ రెండవ ముక్క స్త్రీ మూర్తిగా
మలిసి, అతడికి అంతులేని ఆనందాన్ని కలిగించింది. ఇలా పతనంచేత
ఏర్పడ్డారు కనుక ఆ స్త్రీ పురుషులిద్దరికీ పతి, పత్ని అన్న పేర్లువచ్చాయి.
పతి అంటే భరించేవాడనీ పత్ని అంటే భరింపబడేదని అర్థాలు. మంగా
రూఢి అయి, వేళ్ళు పాతుకుపోయాయి. ఇలాంటిదే ఒకకథ క్రైస్తవ
గ్రంథంలో ఉన్నట్టు ప్రచారంలో ఉన్నది. అది పురుషుడికి సమ సౌక
ర్యాలు దైవము కల్పించినా అతడికి తన జీవితములో అవ్యక్తమయిన
కలిత బాధిస్తుంటే దేవుడు అతడి ప్రక్కటెముక తీసి స్త్రీగా మార్చాడట.

బైబిల్ గ్రంథంలోని ఈ కథ బృహదారణ్యకోపనిషత్తులోని పై కథ మాట భేదమేగాని ఒకటిగానే ఉన్నాయి.

స్త్రీ పురుషులలో ఎవరధికులు? ఈ ప్రశ్న ఒక సంఘానిది ఒక దేశానిది కాదు. అన్ని దేశాలూ ఈసమస్యతో సతమత మయినవే. అన్ని దేశాలూ దీనిపైన తర్జనభర్జనలు సాగించినవే. అయినా ప్రతిదేశంలోనూ స్త్రీలకు కొంత గౌరవ ప్రతిపత్తి లేకపోలేదు. పురుషుడితో సమానమైన ప్రతిపత్తి ఉన్నదా- లేదా? లేనట్లయితే ఉండాలా? అన్న చర్చలు సాగుతూనే ఉన్నాయి. ఈ చర్చలూ ఆందోళనలూ ఉద్యమాల ఫలితంగా స్త్రీకి పురుషుడితో సమానమైన గౌరవప్రతిపత్తిని కొన్నిదేశాలు సాధించుకున్నాయి. కొన్ని దేశాలు శాసనాలుచేసి చేతలదగ్గర వెనుకడుగు వేస్తున్నాయి. ఈ సత్యము తరతమభేదాలతో దాగుడుమూతలాడుతున్నది.

"పాశ్చాత్య దేశాలలో స్త్రీ చాలా పురోగమించింది. పురుషుడితో సమాన న ప్రతిపత్తిని సాధించుకున్నది. కాని—భారతనారి చాలావెనుకవడి ఉ ది. సంఘంలో ఆమె గౌరవ ప్రతిపత్తి అధమాధమంగా ఉంది" ఈ భా ము విదేశీయులలోనే కాకుండా మనదేశంలోకూడా చాలామందికి ఇప్పటికీ లేకపోలేదు.

భారతదేశంలో స్త్రీల గౌరవ ప్రతిపత్తికి ఇతర దేశాలలోని స్త్రీల గౌరవ ప్రతిపత్తికి చాలా భేదము ఉన్నది. స్త్రీలపట్ల హిందువుల దృక్పథమే వేరు.

యత్రనార్యస్తు పూజ్యంతే
రమంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే
సర్వాస్తత్రా ఫలాః క్రియాః

"ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు క్రీడిస్తారు. ఎక్కడ పూజింపబడరో అక్కడ అన్ని కార్యములు నిష్ఫలములు" అన్నది భారతీయుల ఆదర్శము. ఇది చాలా ప్రాచీనమైనది.

ఫ్రెంచి రచయిత అయిన లూయిన్‌జాకొవియట్ భారతదేశాన్ని గురించి వ్రాస్తూ " సంఘములోనూ కుటుంబంలోనూ అత్యున్నతమైన

నము స్త్రీలకు కల్పించిన భారతీయుల నాగరికత సంస్కృతి అతి
చీన నవి. హిందూమతములో వేదాలు కల్పించినట్టు మరే మతము
ను లకు ఉన్నతస్థానము కల్పింపబడలేదు. వారి నాగరికత
సంస్కృ జ్యూస్ నాగరికత సంస్కృతులకంటె పురాతనమైనవి" అని
ముగించాడు.

ఈనాటి సంఘములో స్త్రీ పురుషుల గౌరవ ప్రతిపత్తిని వారి
ర్థిక విద్యా పరిస్థితులనూ, రాజకీయంగా వారి అవకాశాలనుబట్టి అంచనా
యడము జరుగుతున్నది. కాని ప్రాచీన సమాజములో స్త్రీ పురుషుల
.రవ ప్రతిపత్తి మత సంబంధమైన కార్యకలాపాలలో వారి విశేషాధి
ృతపైన ఆధారపడి ఉండేది.

స్త్రీ పురుషుల స ష్టి భిన్నాభిన్న దృక్పథాలతో జరగటంచేతస్త్రీల
శారీరక నిర్మాణము పు షుల శారీరక నిర్మాణంవంటిది కాదు. అందు
చేత భుజబలంతో పురు లు చేసే పనులు కొన్నిటిని స్త్రీలు అన్ని సమ
యాలలోనూ చేయలేరు. దానికి వారి శారీరక నిర్మాణము అవరోధము
ల్పిస్తుంది. అంతమాత్రంచేత స్త్రీలు తక్కువనీ, పురుషులు ఎక్కువనీ
నుకోవటం పొరపాటు— అవివేకము, ప్రకృతి ఎవరికి ఏ ధర్మము
ర్దేశించిందో దానిని సక్రమంగా నిర్వహించటానికి మతమూ సంఘమూ
హాదం చెయ్యాలి. సంతానవతియై బిడ్డలను సంరక్షణ చేయటంలోను
రుషుడికి అన్నివిధాలా సహకరిస్తూ గృహస్థాశ్రమాన్ని నిర్వహించటం
నూ స్త్రీ పురుషుడి సమాన భాగస్వామిని.

## వేదకాలంలో

పాశ్చాత్య దేశాలలోని వివాహ సంస్థకూ భారతదేశంలోని వివాహ
ంస్థకూ కొండంతవ్యత్యాసమున్నది. కేవలము విషయలోలతను పురస్క
ంచుకునే ఆదేశాలలోని వివాహసంస్థ ఏర్పడ్డది. భారతదేశంలో వివాహ
సంస్థకు ధర్మము మూలహేతువు. అర్థకామాలు ఆ హేతువుకు అంగాలు.
యజ్ఞయాగాదులద్వారా దేవతలను సంతోష పెట్టడమూ, తద్వారా స్వర్గ
లంకరించటమూ, మానవుడిధర్మమని వేదమతము ఆదేశిస్తున్నది. యజ్ఞ
ాగాది క్రతువులు చేయటానికి ఒక పురుషుడుగాని ఒక స్త్రీ గాని విడి

విడిగా చేయటానికి అధికారములేదు. దాంపత్య ధర్మముగల స్త్రీ పురుషు అందుకు అర్హులని ప్రాచీనులు నిర్ణయించారు. పత్ని లేకుండా పురు- డొక్కడూ ఈ క్రతువులు నిర్వహించే అధికారము లేకపోవటంచేత యొక్క ప్రాముఖ్యత వివాహము యొక్క అవశ్యకత హిందూమ ములో స్థావరమేర్పరచుకున్నాయి దంపతులు ఒకరినొకరు మన్నించు కుంటూ గృహస్థాశ్రమాన్ని సార్థక్యము చెయ్యాలి. హిందూ సంఘములో గృహస్థాశ్రమానికిచ్చిన గౌరవము మరిదేనికి ఇవ్వలేదు. అతిథి అభ్యాగ తులకూ యతులకూ బ్రహ్మచారులకూ పేదలకూ ఆర్తులకూ ఆశ్రయ మిచ్చే ఉత్తమమైన ఆశ్రమము గృహస్థాశ్రమము. ఇది ఆశ్రమాల కన్ని టికి తలమానికమని అగ్రస్థానమిచ్చారు. అగ్నిహోత్రము నిర్వర్తించ టా నికి యజ్ఞయాగాదులు చేయటానికి భర్తకోపాటు భార్యకూడా గృహస్థా శ్రమములో తన ధర్మాలను నిర్వర్తించవలసి ఉన్నది. ఈవిధముగా తమ ధర్మాలను సక్రమంగా నిర్వహిస్తూ అన్యోన్య ప్రేమతో ఉండే దాంప త్యము దక్షస్మృతిలో చాలా గొప్పగా చెప్పబడినది- అనుకూల, ప్రియ భాషిణి, కుశలి, సాధ్వి, గుట్టుకలది, పతియెడ ప్రేమకలది అయిన స్త్రీ దేవతయేగాని మానుషికాదు. అటువంటి పత్ని లభించినవానికి స్వర్గ మిక్కడే ఉన్నదని స్మృతికారులు పేర్కొన్నారు.

ఆ కాలములో స్త్రీ అనగా భార్య భర్తకు బానిసకాదు- భార్యవల్లనే గృహము నిలిచిఉన్న న్న భావము "జాయేదస్త"అన్న ఋగ్వేదవాక్యము తెలుపుతున్నది. " ప్రారీణ హస్సేశా" అన్న యజుర్వేద వాక్యము కూడా పైభావాన్ని ృవపరుస్తున్నది. ధర్మార్థ కామము అనే మూడుపురు షార్థాలను నెరవేర్చటానికి సానుభూత కనుకనే పత్నికి విశేష గౌరవ మ్వబడినది.

ప్రజామను ప్రజాయసే
తదుతే మర్త్యామృతం

ఓ మానవుడా! నీవు సంతానము ననుసరించి పుట్టుచున్నావు. సంతానమే నీకు అమృతము.

భర్తకు తద్వారా వంశానికి మహోపకారము చేసేదికనుకనే ఆమెకు అమితమైన గౌరవము. స్త్రీ పురుషుడికి జీవితకాలములో సమస్త సుఖాలను

ఇచ్చేదే కాక అమృతాన్ని అనగా పుత్రులను ప్రసాదించి పునర్జన్మకు ఆస్కారమయిన భార్య కేవలము భోగలాలసకే ఉద్దేశింపబడిన దనుకోవ దము వైదిక మతానికెంత విరుద్ధమో దీనివల్ల మనకు స్పష్టమవుతుంది.

వివాహకాలమందు వరుడు వధువుతో "ఏడడుగులువేసిన మనము ఒకరికొకరము స్నేహితులము. మనము ఒకరినొకరము విడువవద్దు. నిర్వర్తించవలసిన ధర్మములను నిర్ణయించుకుంటూ ఒకరి ఆత్మను మరొ కరికి అర్పించుకుంటూ అన్యోన్యముగా ఉందాము" అని సప్తపదుల సంద ర్భములో అంటాడు. వేదకాలములో దాంపత్యము మరణానంతరముకూడా నిలిచేదిగా చెప్పబడటంచేత దాని యచ్ఛేద్యత స్పష్టమవుతున్నది. భార్యను భర్తగాని భర్తను భార్యగాని త్యజించటానికి వీలులేదనే వేదాలభావము. భర్తను ప్రేమచేత వశపరచుకున్న స్త్రీ వేదాలలో మిక్కిలి స్తుతింప బడ్డది.

దంపతుల మధ్యగల స్నేహానికి లోకంలోని ఇతర స్నేహాలకూ కొంతంత వ్యత్యాసమున్నది. ఇతరములయిన స్నేహాలు నశించవచ్చు. కాని— దంపతుల మధ్యగల స్నేహము నశింపకూడదన్న విషయము స్పష్టంగా వేదమంత్రాలవల్లతెలుస్తున్నది. స్నేహము లేక ప్రేమ ఉన్నంత కాలమే దాంపత్యము ఉండాలన్న నియమం కాక—దాంపత్యము ఉన్నంత కాలమూ స్నేహము ఉండి తీరవలెనన్నదే వైదిక దాంపత్య రహస్యము. దాంపత్యము శాశ్వతము కనుక వారిమధ స్నేహముకూడా శాశ్వత ముగా ఉండవలెననే వైదిక దాంపత్యసూ . కనుక స్నేహమువదిలిన దంపతులు వైదికమతానికి విరుద్ధముగా ప్రవర్తించిన వారవుతారని విశ్వా సము.

భర్త భార్యపైన అధికారము కలవాడే అయినా అతడు తన కారాన్ని చూపి లేక- స్నేహభావాన్ని చూపే ఆమెను తనకు అనుః లము చేసుకునేవాడు. హృదయములో ప్రేమలేని వ్యక్తి కనబరచే వి యము వల్ల భర్తకు ఆనందం కలగదు కదా!

"సంమాతరిశ్వాసం ధాతాసముదేష్ట్రి దధాతనౌ" వాయువు బ్రహ సరస్వతి మా బుద్ధులు పరస్పరానుకూలము అగునట్లు చేయుగాక! అని ప్రార్థనలు చేస్తారు.

పై అంశాలను బట్టి చూస్తే పురుషుడి ఆధిక్యత స్పష్టమే అయినా అతడామెకిచ్చిన స్థానమే విచిత్రముగా ఉన్నది. భర్త భార్యను తనతో సమానముగా చూసుకోవటమే కాకుండా తననామెకు అర్పించుకోవటము కూడా వేదాలలో కనబడుతుంది.

"అస్మిన్ గృహే గార్హ్య పత్యాయ జాగృహి"

ఓవధూ! ఈ గృహమందు గృహపతిత్వము కొరకు మేల్కొనుము

వధువు వరుడికి బానిసకాదు— రాజ్ఞీ పీఠాన్నలంకరించటానికి ఆహా నింపబడిన ప్రభ్వి. చాకచక్యముతో మాతృ హృదయంతో విశ్వ వ్యా మయిన ప్రేమతో గృహాన్ని పాలించటానికి వచ్చిన గృహయజ మా రాలు. ఆమె పరిపాలన పాలితులను బాధపెట్టేదికాదు. ఆమె పాలనలో అంతకుముందున్న దుఃఖాలు నివారితమవుతాయి. భూలోకము స్వర్గలోక మవుతుంది. ఆనాటి పురుషుడికి సత్కర్మ లన్నిటి ఫలమైన స్వర్గము భార్యాధీనమైఉండేది. దానిననుసరించే "భార్యా ధీన స్తథా స్వర్గః" అన్న ఆర్యోక్తి బయలుదేరింది.

ఆ కాలములో స్త్రీలు లౌకికముగా ప్రముఖపాత్ర వహించారు. అర్థశాస్త్రము రచించటానికి బృహస్పతి మానవ గంధర్వ దేవతా స్త్రీలయొక్క శుశ్రూషచేసి వారి ఆదేశ ప్రకారమే అర్థ శాస్త్రము రచించాడు. ఋషుల కాలములో అనసూయ అరుంధతి ఆర్థిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు, మైత్రేయి గార్గి మంచి వక్తలు. గార్గి వేద వాదిని. మహాపండితుల సభలలో వేదాంత గోష్ఠిలో పాల్గొనేదని గార్గి బ్రాహ్మణ్యము వల్ల తెలుస్తున్నది. వేదపాండిత్యములో అసమాన ్రన లోపాముద్ర విశ్వవార మొదలైన స్త్రీలు చిరస్మరణీయలు. వులు వేద కాలములో లేరని చెప్పలేము గాని బహు అల్పసంఖ్యలో ఉండేవారు.

ఋగ్వేదములో 1028 సూక్తములలో 23 సూక్తములకు స్త్రీలు ఋషులుగా (కర్తలుగా) ఉన్నారు.

కొన్ని సూక్తములకు స్త్రీలు ఋషులుగా ఉండటం వల్లనూ

స్త్రీలు పఠించటానికి వీలయిన కొన్ని మంత్రాలు ఇతరత్రా ఉండటం చేతనూ వేదము స్త్రీలందరికీ అన్ని సమయాలలోనూ నిషిద్ధమని చెప్పటానికి వీలుకాదు.

వేదకాలములో అనగా శ్రుతికాలములో స్త్రీలకు మత సంబంధమైన కార్య కలాపాలలో అధికారమేగాని అనధికారము లేదు. దాని తరువాత దైవస్మృతి కాలాంతమందు స్త్రీలు వేదాధ్యయనానికి అనర్హులని చెప్పబడినది. వేదకాలములో వేదసూక్తులు రచించిన రచయితలలో స్త్రీలు ఉండటమే కాకుండా యజ్ఞ యాగాదులు, హవనములు, క్రతువులు మొదలైనవి స్త్రీలు లేకుండా జరుగలేదు. తపస్సుచేసి మోక్షసాధనే ప్రధానమనుకున్న కాలములో స్త్రీ అవరోధముగా భావించబడ్డది.

వేదాధ్యయనానికి ఉపనయనం ప్రధానంగా ఎంచబడినది. ఉపనయనము ఏడవ ఏట చేసేవారు. ఉపనయనము జీవితములో ప్రధానమైన ఘట్టము. వేదాకాలములో ఈ ఉపనయనము బాలురకెంత ప్రధానమైనదో బాలికల కంత ప్రధానమైనదిగా భావించ బడ్డది. ఉపనయనమూ వేదాధ్యయనమూ బాలికలకు తగిన వరులను సమకూర్చటములో విధిగా సహకరించేవి.

ఋషులచేత వ్రాయబడిన ధర్మశాస్త్ర గ్రంథాలకేస్మృతులని పేరు. ఆ స్మృతి కాలంలో కూడా స్త్రీల గౌరవ ప్రతిప త్తికి లోపము రాలేదు. అన్నదమ్ములుగల కుమార్తెకంటె వారు లేనికుమార్తె వలన పితృవంశానికి అధికలాభము కలుగుతున్నదని విశ్వసించబడ్డది. కుమారుడేవిధముగా వంశవర్ధను డవుతున్నాడో ఆమెకూడా ఆ విధముగానే వంశవర్ధని కాగలదన్న నమ్మకము ఉండేది. అందుకే ఆమెకు పుత్రిక అన్న పేరు వచ్చింది. అన్నదమ్ములుగల కుమార్తెకు పుత్రిక అన్నపదము ఎక్కడా వాడలేదు. అభ్రాతృదుహిత తన పుత్రునిద్వారా తన తండ్రిని పున్నామ నరకమునుండి రక్షించుతున్నది. కనుక ఆమెకు పుత్ర ధర్మముగా పుత్రిక అన్న పేరు అన్వర్థ మవుతున్నది.

"అపుత్రోనేక విధినా సుతాం కుర్వీత పుత్రికాం" అని మన స్మృతిలో చెప్పబడి ఉన్నది. పుత్రులు లేనివారు ఈ విధానముచే

కుమార్తెను పుత్రికగా చేసుకొన వలెనని దీని తాత్పర్యము. ఇటువం పుత్రికల వలెనే తండ్రి వంశము వృద్ధి అయేది. ఈ విధంగా పూర్వ అనేకులు వంశాభివృద్ధి చేసుకున్నారు.

ఆ కాలములో ఆడపిల్ల కలవాడు పుణ్యాత్ముడనే స్మృతుల అ ప్రాయము. షోడశదానాలలో కన్యాదానమే గొప్పదానము. కన్యాదా మాత్రంచేత తండ్రితోపాటు అతడి పితృదేవతలు కూడా తరించు తున్నా రని అర్వాచీన గ్రంథాలలో చెప్పబడినది.

"దా స్యామి విష్ణవే తుభ్యం
బ్రహ్మలోక జిగీషయా"

బ్రహ్మలోక కాంక్షతో విష్ణు స్వరూపుడవగు నీకు కన్య నర్పిం చున్నాను.

"త్వద్దానాన్మోక్ష మా ప్నుయాం"

ఓ కన్యా; నిన్ను దానము చేయుటచేత మోక్షము నొందగలను.

"కన్యా మి మాం ప్రదాస్యామి
పితూణాం తారణాయవై"

"పితృదేవతలు తరించుటకై ఈ కన్యను దానం చేయుచున్నాను.

ఈ విధంగా సంవర్త స్మృతిలో కూడా కన్యాదానానికి ఈ క్రింది ఫలము కలుగుతుందని చెప్పబడినది. "చక్కగా అలంకరింప బడిన కన్యకు బ్రహ్మ వివాహముచేత ఎవరు వరునకు కన్యాదానము చేయు దురో వారు మిక్కిలి శ్రేయస్సునూ కీర్తినీ సజ్జనసాంగత్యమూ వస్తువ ులనూ పొందుదురు జ్యోతి ష్టోమాది యోగముల ఫలములకు నూరురెట్లు ఫలము పొందుదురు. హోమ మంత్రములచేత సంస్కరింప బడిన కన్యను భూషణాచ్ఛాదనానములచే అలంకరించి ఇచ్చువాడు స్వర్గము పొంది దేవతలచేత పూజింపబడును" కుమార్తె తన తండ్రికీ అతడి వంశానికీ ఎంత మహోపకారి కాగలదో పైన చెప్పబడిన వాక్యాలను బట్టి స్పష్టము కాగలదు. స్మృతి కారులు స్త్రీ సంతతి కెంత ప్రాశస్త్యమ కల్పించి గౌరవించారో విశదమవుతున్నది.

కుమార్తె కేవలము తానేకాక తనసంతతిద్వారా కూడా పితృ
ంశానికి మహోపకృతి సలువుతున్నది. దౌహిత్రుని వలన కూడా మాతా
మహుని వంశము తరించు తున్నదని స్మృతుల అభిప్రాయము. దౌహిత్రు
ంటే పితృదేవతల కెంతో ప్రీతియట.

బోధాయనుడు "పురుషుడు స్త్రీని తన ఇచ్ఛచే వివాహ మాడుట
దు. దేవతలు పురుషుడుకి భార్యను ప్రసాదించుతున్నారు. సాధ్వియైన
ార్యను ఎల్లప్పుడూ భర్త మన్నించవలె. అట్లు చేయుచో దేవతలకు
ప్రియము కలుగును" అని చెప్పుతూ భార్యను త్యజించిన వారికి ఆయన
ఘోరమైన శిక్ష విధిస్తున్నాడు. దక్ష స్మృతిలో కూడా॥అదుష్టాం పతితాం
ార్యాం యౌవనే యః పరిత్యజేత్ సజీవనాన్తే స్త్రీత్వంచ వంధ్యాత్వం చ
మాప్నుయాత్" దుష్టురాలు కాబట్టే రోగాలచే పీడించ బడనట్టి భార్యను
దలిపెట్టిన వాడు ఉత్తర జన్మలో వంధ్యా స్త్రీ యగును" అని చెప్ప
డినది.

స్మృతి కాలములో స్త్రీలు ఉపనయనానికి వేద పఠనాధికారానికి
నరర్హులని చెప్పబడినప్పటికి పాణిగ్రహణము వలన పురుషుడే కర్మ
సిన వాటిని భార్య కూడా చేస్తునటే అర్థమని చెప్పబడినది. ఆమె కొన్ని
ర్మలలో విధిగా పాల్గొనవలసి ఉంటుంది. శ్రౌతకర్మలలో అక్కడక్కడ
త్ని సన్నహనము జరగటము వాడుకలో ఉన్నది. ఈ మంత్రాలను
దవ నవసరము లేనప్పుడుకూడ పత్ని పతితోపాటు కర్మచేస్తున్నట్లే భావిం
లి. అంతేకాక పుణ్యకర్మ ఫలము భర్తతోపాటు ఆమె పొందుతున్నది.
ర్త సంపాదించిన పుణ్యములో భార్య పాల్గొనునని చెప్పబడ్డది. కాని—
తడి పాపములో భాగము పొందునని ఎక్కడా చెప్పబడలేదు. భార్య
న పుణ్యముచేత భర్త పాపి అయినా స్వర్గానికి పోగలదని చెప్పబడ్డది.

## స్త్రీ ధనము

మనస్మృతులలో కన్యలకు సోదరులు తమతమ భాగములనుండి
వేర్వేరుగా నాలుగవ భాగమివ్వవలెనని, ఆ విధముగా వారు ఇవ్వని
క్షములో వారు పతితులవుదురని చెప్పబడినది. ఈ నాలుగవవంతు ధన
ముతో తమసోదరికి వివాహము సోదరులే చేయవలెనని యాజ్ఞవల్క్య
స్మృతిలో ఈ అంశము స్పష్టముగా చెప్పబడి ఉన్నది. కన్యలకు మాతా

మహి ధనమునుండి కూడా కొంతభాగము ఇవ్వవలెనని మనువు చెప్పి ఉన్నాడు. తల్లియొక్క ధనము ఆమె అనంతరము కుమార్తెలు పంచు కొనవలెనని స్మృతులు చెప్పుతున్నాయి. దుహితృత్వములోనేకాక మాతృ త్వములో కూడా ఒకప్పుడు దాయము పొందుటకుస్త్రీఅర్హురాలు కాగలదని మనువు చెప్పిఉన్నాడు.సంతతిలేని కుమారుని ధనముతల్లికే చెందుతుందని ఆయన స్పష్టంచేశాడు. తండ్రి చనిపోయిన తరువాత అతడి ధనము కుమారులు పంచుకునేటప్పుడు తల్లికికూడా కుమారులతోపాటు భాగం వస్తుందని యాజ్ఞవల్క్యుడు చెప్పి ఉన్నాడు, దాయభాగమున వచ్చేసొత్తే కాక. ఇంకా అనేక విధములుగా స్త్రీలకు ధనముచెందటానికి వీలు ఉన్నది. స్మృతికారులచేత స్త్రీ ధనము మొత్తము ఆరు విధములుగా విభజింపబడి నది.

1. వివాహకాలమందు అగ్నిసాక్షిగా పిత్రాదులచేత కుమార్తెకు ఇవ్వబడినది.
2. కుమార్తె అత్తింటికివెళ్ళేటప్పుడు ఆమెకు ఇవ్వబడినధనము
3. భర్త సంతోషముతో భార్యకిచ్చిన ధనము
4,5,6. సోదరులు, తల్లి, తండ్రీ, ఇతరులు ఇతరసమయాలలో ఆమెకిచ్చిన సొత్తు.

ఈ భావాన్నే యాజ్ఞవల్క్యుడుకూడా బలపరుస్తున్నాడు. "తండ్రీ సోదరుడూ, భర్తా, మరదీ స్త్రీలను పూజించి సదా అలంకారాదికాలు ఇస్తూ ఉండాలి" అన్నాడు. తోబుట్టువులు ఏ ఇంటిలో పూజింపబడక శపింతురో ఆ ఇల్లు నశించునని శాపంకూడా పెట్టిఉన్నారు, స్త్రీలకు భర్త్రాదులవల వచ్చే కానుకలు అనేక విధాలు. వివాహములో వరుడు దాతకు శుల్కాన్ని ఇవ్వటమేకాక కన్యకుకూడా కొంత ధనము ఇవ్వటమనే ఆచారము ఉన్న కన్యాదాతకు వరుడిచ్చిన ధనాన్ని కన్య తల్లిదండ్రులు అనుభవించర ఆది కన్యకే పూర్తిగా చెంతుంది భార్య ఆరోగ్యవతిగానూ సంతానవ గాను ఉన్నట్లయితే భర్త తిరిగి వివాహము చేసుకోవటానికి వీలు లేద ద్వితీయ వివాహము చేసుకోవలసివచ్చిన పరిస్థితిలో ఆ వివాహానికిఅయ్యే ఖర్చు ప్రథమ కళత్రానికి ఇవ్వవలసి ఉంటుంది. ఈ విధంగా చెంది

స్త్రీ ధనం ప్రత్యేక శ్రద్ధతో కాపాడటము రాజు యొక్క ధర్మము. స్త్రీ. ధనాన్ని అపహరించటము మహాపాపముగా పరిగణింపబడినది.

## హిందూ స్త్రీలు—వారసత్వాధికారము

భారతదేశములో మానవ ధర్మ సూత్రాలు గౌతమ ఋషి చేత ప్రబోధింప బడ్డాయని శాస్త్రప్రమాణము. మనుధర్మ శాస్త్రము క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దములోనూ యాజ్ఞవల్క్య సంహిత క్రీస్తు శకము మొదటి శతాబ్దములోనూ వ్రాయబడినదని నిర్ణయింపబడినది. అంతకు పూర్వము ప్రజలశాసనాలను గురించి సాంఘికాచారాలను గురించి ప్రామాణికమైన చరిత్ర లేదు. రాజుల పరిపాలనను గురించి వ్రాశారు కాని మానవ ధర్మశాస్త్రాన్ని గురించి ఎవరూ వ్రాసినట్టు లేదు.

మనుధర్మ శాస్త్రాన్ననుసరించి స్త్రీకి ఏ విధమయిన అధికారమూ లేదు. బాల్యములో తండ్రి, యౌవనములో భర్త, వార్ధక్యములో కుమారుడు స్త్రీని పోషించి కాపాడవలసిన వారు. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని శాసించిన వాడు మనువు. కాని యాజ్ఞవల్క్యుడు స్త్రీలకు కొన్ని హక్కులు కల్పించాడు. వితంతువులకు సమష్టి కుటుంబములోను వ్యష్టి కుటుంబములోను విడివిడిగా హక్కులు కల్పించాడు. సమష్టి కుటుంబములో మగ సంతానము లేని వితంతువుకు ఆ కుటుంబ గౌరవానికి తగినట్టుగా మనోవర్తి ఇచ్చే ఏర్పాటు చేశాడు. విభక్త కుటుంబములో మగ సంతానము లేని వితంతువుకు పెనిమిటి ఆస్తిపై అనుభవాధికారము మాత్రమే కల్పించాడు.

11 వ శతాబ్దములో హిందూ ధర్మశాస్త్రానికి విజ్ఞానేశ్వరుడు భాష్యము వ్రాశాడు. ఇదే మితాక్షరి గ్రంథము. ఈ మితాక్షరీయము యావద్భారతములోనూ వర్తించేది. దీని ప్రకారము స్త్రీకి మరి కొన్ని హక్కులూ, అధికారాలూ, లభించాయి. వితంతువులకు దత్తతాధికారము లభించింది. పెనిమిటి ఆస్తిపైన కేవలము అనుభవాధికారమే ఆపత్కాలము లోను అవసరసమయాలలోను కుటుంబాభ్యుదయానికి గాను ఆస్తిని వినియోగించే అధికారము కల్పింప బడ్డది. దీని ననుసరించి కుమార్తెల వివాహాలకూ కోర్టు ఖర్చులకు కొంతభాగము విక్రయించి వినియోగించవచ్చు. భర్తచేసిన ఋణాలు తీర్చవలసి వచ్చేది. ఆస్తిని బాగుపరచే అధికారము కూడా స్త్రీకి లభించింది.

హిందూ ధర్మశాస్త్రంలో వారసత్వము రెండు విధాలుగా లభించేది. మొదటిది రక్తసంబంధము. రెండవది పిండ సంబంధము. పిండ సంబంధమైనది మతాన్ననుసరించినది. చనిపోయిన వ్యక్తికి సద్గతులు కల్పించటానికి గాను ఆ కుటుంబములోని సన్నిహితులు కర్మకాండ జరుప వలసి ఉంటుంది. చనిపోయిన వ్యక్తికి కుమారులు ఉన్నట్లయితే ఈ భారము వహించ వలసిన బాధ్యత వారిదే. వారు లేని పక్షాన వితంతువు ఈ బాధ్యత వహించాలి. విజ్ఞానేశ్వరుడీ మితాక్షరీయము ఈ విధముగా మత సంబంధాన్ని రక్త సంబంధాన్నీ పిండ సూత్రాలతో కలిపింది.

## వివాహము

వివాహాల విషయమై కూడా ప్రాచీనులు సమాజాభ్యుదయ దృష్ట్యా కొన్ని సూత్రాలను చేశారు. ధర్మ శాస్త్రానుసారము అగ్ని సాక్షిగా వివాహమాడిన దంపతులు ఆజన్మాంతము బద్ధులనే చెప్పబడినది. కాని క్రీ కు పూర్వము నాలుగవ శతాబ్దము నాటి వాడయిన కౌటిల్యుడు (అర్థశా వేత్త) కొన్ని సందర్భాలలో వివాహము రద్దు చేసుకోవటానికి అనుమ ంచాడు. ఈ అనుమతి గాంధర్వ, ఆసుర, రాక్షస, పైశాచిక వివాహాలకు మాత్రమే లభించింది, బ్రాహ్మణులకు తప్ప మిగతా జాతులకు లభించినట్లు బోధపడుతుంది. కౌటిల్యుడి శాస్త్రాన్ననుసరించి భర్తృ పరిత్యక్తలు పెనిమిటి వద్ద నుండి మనోవర్తిని పొందే అధికారము కలిగి ఉన్నారు. ఈ మనోవర్తి భర్త ఆదాయాన్ని బట్టి ఉంటుంది. కొన్ని పరిస్థితులలో స్త్రీలు పునర్వివాహము చేసుకోవటానికి వీలు కల్పించాడాయన. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాల స్త్రీలు సంతానము లేకపోయినా భర్త దేశాంతర గతుడైనా—ఆటువంటి పరిస్థితులలో తిరిగి వివాహము చేసుకునే అధికారము లభించింది. కౌటిల్యుడు స్త్రీ పునర్వివాహాన్ని నియోగముగా భావించాడు. భర్త దేశాంతర గతుడైనా, సాధువులలో కలసినా, మృతి చెందినా భార్య సంతానవతి కాకపోయినట్లయితే ఏడు మాసముల కాలము ఎదురు చూసిన తరువాత ఆమె తన పెనిమిటి సోదరులను లేక గోత్రజులను వివాహమాడవచ్చు నన్నాడు.

వితంతువు పునర్వివాహము చేసుకోదలచినట్లయితే చేసుకోవచ్చు

ననీ, భర్త చనిపోయిన తరువాత మనోనిగ్రహముతో పరమ పవిత్రంగా జీవితము గడప దలచితే గడపవచ్చుననీ చెప్పాడు కౌటిల్యుడు.

పునర్వివాహము చేసుకోదలచిన పురుషులకు స్త్రీల కంటె అధికంగా నిబంధనలు పెట్టాడు కౌటిల్యుడు. భార్య సంతానవతి కాకపోతే, సంతానములో అందరూ మృతి చెందినట్లయితే, పురుషుడు తిరిగి వివాహము చేసుకోవటానికి ఎనిమిది సంవత్సరాలు ఆగవలసి ఉంటుంది. ప్రథమ భార్య మృత శిశువును ప్రసవించినట్లయితే పది సంవత్సరాల కాలము ఆగవలసి ఉంటుంది. పురుష సంతానము లేకపోతే పై నిబంధనల ననుసరించి వివాహము చేసుకోవలసి ఉంటుంది. నిబంధనలను ఉల్లంఘించిన పురుషుడు శిక్షాపాత్రుడు.

కౌటిల్యుడి న్యాయ సూత్రాలు పురుషుల కంటె స్త్రీల కెక్కువ నుకూలంగా ఉన్నాయి.

ధర్మ శాస్త్రాలు ప్రాచీన కాలములో కూడా ఒక విధంగా లేనట్లు నబడుతున్నాయి. ఆయా కాలాలలోని సమాజ పరిస్థితుల ననుసరించి ర్మము నిర్వచింపబడి శాసనము చేయబడ్డది. కనుకనే కౌటిల్యుడు వాసిన శాస్త్రానికీ పరాశరుడు వ్రాసినదానికీ మనువు వ్రాసిన దానికీ భ్యత్యాసాలు కనబడతాయి.

## సమాన స్వాతంత్ర్యము

సంసారములో భార్యా భర్త లిద్దరికి ద్రవ్య విషయములో సమాన స్వాతంత్ర్యం పాణిగ్రహణము వల్ల కలుగుతున్నది. భర్త ధనాన్ని ఆర్జించటమూ, భార్య ఆ ధనాన్ని నిర్వహించటమూ జరిగితే అది చక్కని సమత్వమని ఆపస్తంబుడు చెప్పి ఉన్నాడు. మనువు కూడా

అర్థస్య సంగ్రహే చైనాం
వ్యయే చైవ నియోజయేత్

అని చెప్పి ఉన్నాడు. అంటే — ధనాన్ని రక్షించటానికీ వ్యయపరచటానికీ స్త్రీ నియోగించాలని ఆయన భావము. అయితే స్త్రీకి భర్త మరణానంతరము అతడి ధనము పొందటానికి అధికారము ఉన్నది.

కాని—అతడు చేసిన ఋణమంతా తీర్చ వలెనన్న విధిలేదు. కాని మూడు విధాలైన ఋణములు మాత్రము తీర్చవలసి ఉన్నది.

1. భర్త చనిపోతూ భార్యను అనుమతింపచేసి తీర్చమని చెప్పిన ఋణము.
2. భర్తతో కలిసి ఆమె చేసిన ఋణము.
3. స్వయముగా చేసిన ఋణము.

ఈపై మూడు రకాలూ ఆమె తీర్చవలసినదే. సమష్టి కుటుంబాలలో ఒకడు అపుత్రుకుడై మరణించిన పక్షములో అతడిభార్యను అతడి సోదరులు పోషించవలెనని నారదుడు చెప్పి ఉన్నాడు. మొత్తము మీద స్త్రీలకు ధర్మశాస్త్రములో కూడా ఒకరిద్దరు వ్యతిరేకించినప్పటికి యథాశక్తిగా గౌరవము ఉన్నట్లే చెప్పబడినది.

## మాతృదేవత

జీవితములోని వివిధ సందర్భాలలో వివిధ పరిమాణాలు గల గౌరవము స్త్రీలకు అంగీకరింపబడినట్లే. వివిధ పదవులలో ఉండే స్త్రీలకు కూడా వివిధ పరిమాణాలు గల గౌరవము అంగీకరించ బడ్డది. అనగా తల్లికి ఒక విధమైన గౌరవము, భార్యకు ఒక విధమైన గౌరవము, కుమార్తెకు ఒక విధమైన గౌరవము, పితంతువుకు ఒక విధమైన గౌరవము—ఈ విధముగా ఒక్కొక్క స్థానములో ఉన్న స్త్రీకి ఒక్కొక్క విధమైన గౌరవము అంగీకరింప బడ్డది. అందరి కంటె మాతకు చూపబడిన గౌరవము సర్వాధికారమై ఒప్పుతున్నది.

ఇయం లోకం మాతృ భక్త్యా
పితృ భక్త్యాతు మధ్యమం
గురు శుశ్రూషా యా త్వేవ
బ్రహ్మలోక సమశ్నుతే

అని మనువు చెప్పి ఉన్నాడు. ఈ లోకాన్ని మాతృభక్తి చేతను పితృభక్తి చేత మధ్యమ లోకాన్ని, గురు శుశ్రూష చేత బ్రహ్మలోకాన్ని పొంద వచ్చునని భావము. తల్లీ-తండ్రీ-గురువూ వారే మూడు లోకాలు వారే మూడు ఆశ్రమాలు; వారే మూడు అగ్నులు. ఈ ముగ్గురిలో త

పథమురాలు. అధిక పూజ్యురాలు. పది మంది ఉపాధ్యాయుల కంటె ,క ఆచార్యుడు. హెచ్చు గౌరవార్హుడు. నూరుమంది ఆచార్యులకంటెతండ్రి హెచ్చు పూజ్యుడు తండ్రి కంటె తల్లి వేయి రెట్లు ఎక్కువ పూజ్యురాలు.

ఉపాధ్యాయాన్ దశాచార్య
ఆచార్యాణాం శతం పితా
సహస్రం తు పితౄన్మాతా
గౌరవేణా తిరిచ్యతే

ని మనువు చెప్పి ఉన్నాడు. తల్లిని గురించి వసిష్ఠ స్మృతిలో

యథా మాతర మాశ్రిత్య
సర్వే జీవన్తి జన్తవః

ల్లిని అనుసరించి సమస్త జంతువులూ, జీవించునట్లు చెప్పబడినది.

ఇదిగాక – మరొక విశేషము : తండ్రి పతితుడైనట్లయితే కుమా డాతనిప భక్తి చూపనక్కరలేదు. కాని, తల్లి పతితురాలైనప్పటికీ తడామెఎ భక్తి గౌరవాలు చూపవలసిందే. తల్లి దోషాలను గురించి ంతించటా కి కుమారుడికి అధికారము లేదు. తల్లి పుత్రుని దృష్టిలో తురాలే కాదని వసిష్ఠుడి వాదము.

పురుషుడికి ఒక తల్లే పూజ్యురాలుకాదు. తల్లీ, మాతామహి, గురు _, తల్లిదండ్రుల అక్కచెల్లెళ్ళు, అత్తగారు, నాయనమ్మ, అక్క దలైనవారు పూజ్యులేకాదు–గురువులుకూడా, స్త్రీలందరూ పూజనీయలే కూడా ఒక సందర్భములో చెప్పబడినది. గర్భిణీస్త్రీని పూజింపవలె నీ, ఆమె కోరికలను మన్నించవలెననీ, ఆమె ఏ దోషముచేసినా ాటలతోనే మన్నించవలసినదనీ మనువూ యాజ్ఞవల్క్యుడూ చెప్పి న్నారు.

ఇవేకాక–స్త్రీలు ఎక్కడ ఎదురైనా పురుషుడు ప్రక్కకు తప్పుకుని మెకు దారియిచ్చి గౌరవించాలని మనువుకూడా చెప్పివున్నాడు.

## ఇహ దైవము

స్త్రీలకు స్వాతంత్ర్యము కొన్ని విషయాలలో కొన్ని సందర్భా లో అంగీకరించలేదన్న అపవాదు ఒకటి ఉన్నది. వారు ఏఏ సంద

ర్భాలలో ఎందుకు చెప్పారో వివరంగా తెలియదు. కొన్ని సూక్తులు మధ్యలో ఎవరయినా చేర్చినా చేర్చవచ్చు. వాటిని గురించి ఎంత ప-శోధన చేసినా ఇప్పుడు తేలే విషయముకాదు. ఒకవేళ నిజమనుకున్న ప్పటికీ - అంతమాత్రంచేత ఆమెకు గౌరవము లేదనుకోవటం పొరబాటు. "ఈ లోకంలో అందరికంటె అధికపూజ్యురాలూ, ఇహదైవము" అని స్మృ తుల టిలో స్పష్టము చేయబడ్డది. ఆ కాలములో - ప్రాచీనుల దృ శో- ల క్షేమము ఆలోచించని వారికి స్వాతంత్ర్యము నిషేధిం బడి ని లుతున్నది.

ఆ కాలములో స్త్రీలు లౌకికవ్యవహారాలను చర్చించుకోవటా ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేసుకునేవారు. పురుషులతోకూడా స వేశాలకు వెళ్ళుతూఉండేవారు. రాజసేవచేసేవారు. కొంతమంది యుద్ధ చేసినట్లు, పురుషోచిత కర్మలు చేసినట్లుకూడా నిదర్శనాలు ఉన్నాం వేదాలలోని స్త్రీ ద్రష్టమయిన సూక్తాలలో స్త్రీలు మాత్రమే చెప్పవల మాటలు చెప్పినట్లు కనబడుతుంది. స్త్రీలు ఆ కాలములో మంత్రద్రష్ట కాకుండా తత్వగోష్ఠులలోకూడా పాల్గొనేవారు. స్త్రీలు ధనసంపా చేసినట్లు నృత్యమూ, సంగీతమూ, వృత్తివిద్యలూ నేర్చినట్లుకూ తెలుస్తున్నది.

ఆ కాలములో స్త్రీ ఏ కులానికి చెందితే సంతానము ఆ కులానికి చెందేది.

## సత్పురుషుల ప్రవర్తన

స్త్రీల ఎడల సత్పురుషులు చూపే గౌరవము మర్యాద రా యణములో ఎక్కడ చూసినా కనబడుతూవుంటుంది. 'పురుషోత్తము శ్రీరాముని ప్రవర్తనమే దీనికి తార్కాణము. లక్ష్మణుడు సీతాదేవి చూపిన గౌరవమూ మర్యాదలూ మాతృభావమూ వర్ణనాతీతము.

నాహం జానామి కేయూరే
నాహం జానామి కంకణే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్.

అంటాడు లక్ష్మణుడు. సీతమ్మయొక్క ఇతర అభరణాలు అతడికి తెలియవట. నిత్యమూ పాదాభివందనము చేస్తాడు కనుక పాదాలంకరణలు మాత్రమే అతడికి తెలుసునట. కన్నతల్లీ, గురుపుత్రభార్యా, మాతులీ అన్నగారిభార్య వయసులో చిన్నవారయినప్పటికీ అందరినీ తల్లులుగా చూసుకునే సాంప్రదాయమది.

తనకు నమస్కరించవచ్చిన శ్రీరామచంద్రుడితో అత్రి మహాముని

అనసూయాం మహాభాగాం
తాపసీం ధర్మచారిణీమ్

అని తనభార్య అనసూయాదేవి ఘనతను ఈ విధంగా చెబుతాడు. "ఆమె పూర్వము పది సంవత్సరాలు వర్షములేక మహాక్షామము సంభవించి, లోకాలన్నీ దగ్ధమవుతున్నప్పుడు ఋషులకు ఫలములు సృష్టించి, గంగానదినికూడా ప్రవహింపచేసిన శక్తిమంతురాలు. పదివేలసంవత్సరాలు అత్యుగ్ర తపముచేసిన మహా ప్రభావురాలు. అనేక వ్రతము లాచరించిన మహా ఇల్లాలు. ఋషులకు కలిగే తపోవిఘ్నాలను నివారించే మహాతల్లి. పూర్వం దేవకార్యం నిమిత్తం పది రాత్రులను ఒకటే రాత్రిగా చేసి న్నన బడసినది. ఈ మహాదేవిని తల్లిగా పూజించు. నీకు శ్రేయస్సు లుగుతుంది. సీతమ్మచేత పాదాభివందనము చేయించు" అంటాడు.

## మాత

వేదకాలములో నేమి శ్రుతి స్మృతుల కాలములో నేమి స్త్రీలు న్ని రంగాలలోనూ గౌరవము పొందినటే చెప్పబడినది. ప్రాచీన కాలమునుండీ భారతస్త్రీలు మాతగా పూజింపబడ్డా. ఈ భావమునే స్వామివివేకానందుడు "భారతదేశములో స్త్రీని మేము మాతగాపూజిస్తాము కాని-పశ్చిమ దేశాలలో స్త్రీని స్త్రీగా గౌరవిస్తారు." అని తన విదేశీ పరటనలో చేసిన ఉపన్యాసాలలో ఉద్ఘాటించాడు.

పైదంతా ప్రాచీన సమాజములో స్త్రీల గౌరవ ప్రతిపత్తి.

## మధ్య కాలములో

క్రమాగతంగా రాజకీయంగా దేశపు పరిస్థితులలో కలిగినమార్పు సమాజంపైన చాలా పడ్డది. ప్రాచీనులు వేసిన బాటలు శిథిలమవుతూ

వచ్చాయి. విశ్వశాంతికి వెలుగు బాటలు వేసిన దని ప్రశస్తిపొందిన భారతదేశంలో వెలుగు బాటలన్నీ చీకటిమయ మయ్యాయి. మతము పేరిట ఆచరణలో ఉన్న ఆచారాలలో అర్థము మటు మాయమయినది. యువతరానికి ఆచారాలలోని అర్థాన్ని సహేతుకంగా నిరూపించి వాళ్ళకు నచ్చచెప్పే ఓరిమి సనాతనులలో కనబడలేదు. సనాతనులకూ ఆధునికులకూ మధ్య పెద్ద అఘాత మేర్పడ్డది. ఈ పరిస్థితులు ప్రజల విశ్వాసాలలో చాలా మార్పులు తీసుకువచ్చాయి.

## మహమ్మదీయుల కాలంలో

మహమ్మదీయుల పరిపాలనలో హిందువులు శీలమే ప్రధానంగా గల స్త్రీ జనాన్ని సంరక్షించుకోవటంలో నానా అగచాట్లు పడ్డారు. ఈ కారణంచేత మారిన పరిస్థితులలో స్త్రీలు ప్రౌఢవివాహాలవల్ల కలిగే లాభాలను ప్రాచీన స్త్రీలు అనుభవించినట్లుగా అనుభవించలేక పోయారు. ఎనిమిది, తొమ్మిది సంవత్సరాలకే కన్యను ఒక అయ్యచేతిలో పెట్టి కాపాడుకొమ్మని కన్యతండ్రి చెప్పవలసిన వాడయ్యాడు. మతము నిర్దేశించినందువల్లనేమి — స్త్రీలను కాపాడేశక్తి లేనందువల్లనేమి భర్త మరణానంతరం స్త్రీ విధిగా సహగమనము చేయటమే ఆచారముగ పరిగణింపబడినది. మహమ్మదీయుల పరిపాలనలో స్త్రీలు వీధివాకిలి ముఖము చూసి ఎరుగనట్లు కనబడుతుంది. హిందువుల మనుగడే కష్టమైనదిగా ఉండేదని తెలుస్తుంది. అటువంటి పరిస్థితులలో స్త్రీ జనాభ్యుదయాన్నిగురించి ఎవరికీ ఆలోచనలు లేకపోవటం సహజము.

### ...పాలనలో

...వ వచ్చినతరువాత భారతదేశములో కలిగిన ...మైనది. ఆంగ్లేయులు పరిపాలనకు పూనుకున్న ...న్ని పిల్చి పిప్పిచేసి ధనాన్ని ముడిసరుకునూ తమదేశానికి ...ఋకుపోయే కార్యక్రమాలలో మునిగిపోయారు. దేశాన్ని విభజించి ...పాలన్న ఆదర్శంతో పథకాలు వేశారు. కాని మతంజోలికి రాలేదు. ...లను అడ్డగించలేదు. దేవాలయాలను పడగొట్టలేదు. ఆంగ్లేయులు ...ా ప్రచారం కొరకు పాఠశాలలు, కళాశాలలు విరివిగా ...ు.

ఆంగ్ల విద్యాభ్యాసం చేసిన యువకులు కొందరు దేశపరిస్థితులను అవగాహన చేసుకోవటానికి ప్రయత్నాలు చేయటం మొదలు పెట్టారు. సమాజంలో సంస్కరణలు ప్రవేశపెట్టాలన్న ఆలోచనలు కలిగాయి. రాజారామ్‌మోహనరాయ్, దయానంద సరస్వతి, గోపాలకృష్ణ గోఖలే ఆర్యసమాజము, బ్రహ్మసమాజము సంస్థలను నెలకొల్పి సంఘసంస్కరణకు పూనుకున్నారు.

ఆయువుతీరిన పెనిమిటితో భార్యను సజీవంగా దహించివేసే ఈ ఆచారము ఎంత ప్రాచీనమైనదయినా భారమైనది కనుక దానిని సమూలంగా నిర్మూలించటానికి కృషిచేశాడు రాజారామమోహన్‌రాయ్ గాని సనాతనులు అంగీకరిస్తారా? ఆచారాలను సంస్కరించ దలచిన వారి సంఖ్య స్వల్పము, వారి బలమూ స్వల్పమే. స్వదేశంలో సనాతనులచేత ఓడింపబడిన రాజారామ్‌మోహనరాయ్ అందరివలె నిరాశచెందలేదు. విదేశాలకు వెళ్ళి సహగమనాచారాన్ని గురించి సమగ్రంగాచర్చించి బ్రిటిష్ గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియాగా ఉన్నలార్డ్ విలియమ్‌బెంటిక్ సహాయంతో స్వదేశానికి వచ్చిన తరువాత 1829లో శాసనము చేయించాడు. రాజారామ్‌మోహనరాయ్ భర్త మరణానంతరంకూడా జీవించే దృష్టాన్ని ప్రసాదించి స్త్రీల పాలిట ఇహలోకపు బ్రహ్మ అయినాడు.

భర్త చనిపోయిన స్త్రీ జనానికి ఆయుర్దాయము పెరిగింది; కాని-వితంతువులయిపోయారు. వీరంతా తిరిగి వివాహము చేసుకునే అధికారము సాంఘికంగాలేదు. పరాయి ప్రభుత్వములో స్త్రీ విద్యకు తగిన అవకాశాలూలేవు; పెద్దలు సమ్మతించనూలేదు. వితంతువులయిన కుమార్తెలను ఎంతమంది తల్లిదండ్రులు పోషించగలరు? యువజన సహజమైన ఉద్రేకపు పొంగులకు స్త్రీ పురుష భేదములేదు కదా? తల్లిదండ్రుల తరువాత-అన్నదమ్ముల ఈసడింపులతో, బావమరదుల అధికారముక్రింద కాసుచేతలేని వితంతువుల జీవితాలు వెట్టిచాకిరి క్రిందికి వచ్చాయి. వారి బ్రతుకులు మూగవేదనలు. ఈ పరిస్థితులను బాగుపరచటానికి కందుకూరి వీరేశలింగం పంతులుగారు కంకణం కట్టుకున్నారు. వితంతు శరణాలయాలను స్థాపించి, వారిని చేర్చుకొని విద్యావకాశాలు కల్పించారు. సంస్కృత ఆంధ్ర ఆంగ్లభాషలలో విద్యనేర్పించారు. వారికి ప్రత్యేకమయిన పాఠశాలలు నెలకొల్పారు. స్త్రీలకూ, పామరులకు

అవగాహనమయ్యే సులభశైలిలో అన్నిరకాల విజ్ఞానాన్ని అందించటానికి వచనరచనలు చేశారు. సంఘాన్ని పీడించి పిప్పిచేసే దురాచారాలనూ మూఢనమ్మకాలనూ రూపుమాపటానికి కళ్ళకు కట్టేటట్టుగా హృదయాలు కలచి వేశేటట్టుగాఅనేక నాటకాలూ, నవలలూ, కథలూ రచించారు. పునర్వివాహము చేసుకోదలచిన స్త్రీలకు తగిన సంబంధాలుచూసి వివాహాలు చేశారు. వితంతువులను వివాహము చేసుకోవటానికి ముందంజ వేయవలసినదని యువకులకు ఉద్బోధచేశారు. స్త్రీ జనానికి ఎనలేని సేవచేసిన వీరేశలింగంపంతులుగారు భర్తమరణానంతరము మోడులా బతకకుండా వారి జీవితాలను చిగురింపచేసిన సౌభాగ్యప్రదాత.

కన్యాశుల్క వరశుల్క దురాచారాలనూ, స్త్రీలు పడుతున్న ఇక్కట్లనూ గురించి ప్రజల హృదయాలు ద్రవించేటట్లుగా నాటకాలూ కథలూ పాటలూ రచించి ప్రచారము చేసిన మరొక మహనీయుడు గురజాడ. వారు రచించిన పుత్తడి బొమ్మ అయిన పూర్ణమ్మ వారి రచనలకు మచ్చుతునక.

అప్పటికి కొన్ని వందల సంవత్సరాలుగా స్త్రీగృహవాతావరణమే గాని బాహ్యపరిస్థితులు ఎరుగదు. గృహవాతావరణంలోనే నోటి పాటల ద్వారా లౌకిక విజ్ఞానాన్నీ, రామాయణ, భారత, భాగవత సారాలనూ చరిత్ర కథలనూ సేకరించుకున్నారు. అప్పటి స్త్రీలకు అక్షరజ్ఞానము లేకపోయినా వాఙ్మాహిత్యము ద్వారా సకల శాస్త్రాలూ పరిచయమే. కొందరు సంస్కృతాంధ్రభాషలు ఇండ్లలోనే గురువులవద్ద అధ్యయనము చేశారు. పంచకావ్యాలూ పఠించారు. కొందరుచీకటిగృహాలలోనే సంస్కృతాంధ్ర భాషలలో కవిత్వము చెప్పారు. కావ్యాలు రచించారు.

కాని—రాజుల మెప్పుకొరకు కవులు కొందరు పచ్చి శృంగార కావ్యాలు రచించి స్త్రీ భోగ్యవస్తువని చాటారు. స్త్రీ కేవలం పడకటింటికీ వంట యింటికే నన్న భావము సంఘములో ప్రబలమయిన కారణాలలో ఇది ప్రధానమైనది.

18 వ శతాబ్దము నాలుగవ దశలో సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా కొంతమంది శ్రీమంతులు తమ కుమార్తెలను నగరాలకుపంపి విద్యావంతులను చేయటం మొదలు పెట్టారు. "స్త్రీలకు విద్య ఎందుకు?

ఉద్యోగాలు చేయనా-ఊళ్ళేగనా?" అని సంఘ విమర్శనలకు ఎదురిది తమ కుమార్తెలను పట్టభద్రలను చేశారు. కొందరు స్త్రీలు వైద్య విద్య నభ్యసించారు. సనాతనుల ఆంక్షలకు వ్యతిరేకంగా స్త్రీలుడాక్టర్లయ్యారు. అప్పటికది చాలా ముందంజ వేసినట్లు లెక్క. అన్ని వృత్తి విద్యలలోకి స్త్రీలు తర్జన భర్జనలు లేకుండా మొదట ప్రవేశించింది వైద్యవృత్తిలోను ఉపాధ్యాయ వృత్తిలోను. శ్రీమంతులు దారిచూపిన తరువాత మధ్య తరగతి ప్రజానీకంలో ఒక్కొక్కరే మేల్కొనటం ప్రారంభించారు. జిల్లాలలో, తాలూకాలలో పాఠశాలలు బాలికల ప్రవేశంతో నిండటం ఆరంభమయింది. అప్పటికి బాలికలకు ప్రత్యేక పాఠశాలలు గానీ, కళా శాలలుగానీ లేవు. అంతా సహ విద్యావిధానములో బోధ జరిగింది.

బాలికలు పాఠశాలలో ప్రవేశించారు గాని-ఎంత మంది? ఎంత కు? చదివిన వారంతా ఏం చేశారు?

అప్పటి సంఘంలో అందరూ బాలికలకు విద్య కావాలని కోరుకో ఏ. ఉన్నత విద్యను అపేక్షించలేదు. చాకలి పద్దువరకూ అంకెలూ క్షరాలూ వస్తే చాలుననుకున్నారు చాలా మంది. కాని—కొందరు ్ల వరకూ చదివించాలని తమ బాలికలను పాఠశాలల్లో చే ారు. ప్పటికి యువకులందరూ ఆంగ్ల విద్యాభ్యాసము చేసిన వారూ చే న్న మూను. వారికి తమ వధువులు విద్యనేర్చి ఉండాలన్న కోరికలుఉం వి. కారణంచేత పాఠశాలా ప్రవేశం చేసిన బాలికలు వివాహానంతరం ్య చాలించారు.

సంఘంలో అప్పటికి ప్రాచీనాచారాలకు విలువ తగ్గింది. కాని- ందరికీ "ఏది గమ్యం? ఏది ఆదర్శం?"అన్న విషయాలలో ఖచ్చితమై ఆలోచనలూ-అభిప్రాయాలూ రూఢీ కాలేదు. కాని-ఏది ఎట్లా ఉన్నా ఆ పిల్లలకు పూర్వాచారాన్ననుసరించి వివాహం చేయాలన్న వాదం-ఆ వి హం కూడా రజస్వలాత్పూర్వమే చేయాలన్న వాదం మాత్రం బలంగ నిలిచింది. సనాతనులు ఎనిమిది సంవత్సరాల వయసుకే (మహమ దీయుల పరిపాలనలో ఆచరణకు వచ్చిన ఆచారము కావచ్చు)-బాలి లకు వివాహం చేయాలన్న నియమాన్ననుసరించి కన్యలకు వివాహా చేయటం మొదలు పెట్టారు. అప్పటి వరుడు పదహారు సంవత్సరా

పైబడిన వాడు. కళాశాలలో ప్ర వే శిం చో లేక ప్రవేశించబోతూనో ఉంటాడు. అతడికి వధువును మాట వరుసకు చూపించినా నిర్ణయాలు పెద్ద వారివే. వరుడు చదువుకుని నాగరీకుడై తన భార్యను పలకరించ వచ్చేటప్పటికి ఆమె అతడి దృష్టికి నచ్చక-పరిత్యజించిన సందర్భాలు ఎన్నో ఉండేవి. ఆమెకు చదువు రాదని ఒక కారణం-ఆమె తనకు నచ్చినట్టుగా అందంగా నాగరికంగా లేదని మరొక కారణం. ఈవిధంగా పరిత్యక్తల సంఖ్య పెరగటం మొదలు పెట్టింది. కొందరు తల్లిదండ్రులు ముక్కుపచ్చలారని పసిబాలికలను ధనప్రలోభంచేత వృద్ధులకూ వికలాంగులకూ కట్టిపెట్టడం జరిగింది. ఆ సందర్భాలలో ఆడ పిల్లలు పరిస్థితులకు ఎదురు తిరిగిన వారున్నారు. పెడత్రోవ తొక్కిన వారూ ఉన్నారు.

బాలికలకు వ్యక్తిత్వము రాకముందు చేసిన వివాహాలవల్ల కలిగిన దుష్పరిణామాల దృష్ట్యా హరబిలాస శారదాగారు రజస్వలానంతర వివాహాలను సంఘంలో ప్రవేశపె టానికి కృషిచేసి శాసనం చేయించారు. ఈ శాసనం 1929 నుండి అ లులోకి వచ్చింది. అప్పటికి సతీసహగమనము, బహుభార్యాత్వము, ల్య వివాహాలు అరికట్టబడ్డాయి.

స్త్రీల పరిస్థితులలో ఆవగింజంత మె రు గు కనబడటం మొదలయింది.

## స్వాతంత్ర్య సమరం

మహాత్మాగాంధీ జాతీయోద్యమం ప్రారంభించటానికి సైన్యాన్ని సమకూర్చుకుంటున్న రోజులవి. ఆయన విశాలదృష్టితో దే శా న్ని ·లుగు మూలలూ పరికించి చూశాడు. జనాభాలో సగానికిపైగా ఉన్న జనంలో చాలా మంది గృహ ప్రాంగణందాటి ఎరుగరు. వాళ్ళను మూఢాచారాలు, మూఢనమ్మకాలూ బంధించి వేస్తున్నాయి. తన ఉద్యమానికి స్త్రీ జనశక్తి ఎంతో అవసరం. వాళ్ళ అధీనంలో వున్న బంగారం తన ఉద్యమానికి ఎంతో అవసరం. ఈ దృష్టితో మహాత్ముడు వాగ్ధాటీ వాక్చాతుర్యమూ గలస్త్రీల శక్తిని జాతీయ ప్రబోధానికి వినియోగించాడు. ధైర్యసాహసాదులు కల వాళ్ళను ఉద్యమాలలో పాల్గొనటానకి ఆహ్వానించాడు. ఓరిమి కల వాళ్ళను ఇంటింటికీ వెళ్లి విదేశీవస్తు బహిష్కరణం స్వదేశీ వస్తు కొనుగోలును గురించి ప్రచారం చేయటానికి పంపాడు.

విదేశీ వస్త్రాలను దహన పరచటానికి కల్లుసారాయి దుకాణాల ఎదుట పికెటింగ్ చేయటానికీ కొందరిని చేరదీశాడు. గాంధీ మహాత్ముడి ఉద్యమాల ఫలితంగా స్త్రీలు సంఘ దృష్టిలో మరో మెట్టు పైకి ఎక్కారు. మహాత్ముడి ప్రశంసల నందుకున్నారు. "స్త్రీలు ధైర్యసాహసాలతో పట్టుదలతో ఏ కార్యాన్నయినా సాధించగలరు. ఎటువంటి పరిస్థితులనైనా ఎదిరించ గలరు. ఎంతటి త్యాగమయినా చేయగలరు. పూర్వము స్త్రీలు యుద్ధాలలో పాల్గొన్నారని చరిత్రలో మాత్రమే చదివాము. కాని-ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాము" అని సంఘానికి తెలియ వచ్చింది. కనువిప్పు కలిగింది. ఇందుకు ప్రత్యక్ష నిదర్శనంగా ఎందరో స్త్రీలు లాఠీ దెబ్బలుతిని- చెరసాల శిక్షననుభవించటము జరిగింది.

కలకత్తాలో హిందూ మహమ్మదీయుల మధ్య కలహాలు రేగి విపరీత పరిణామాలకు దారితీసిన సందర్భంలో మహాత్ముడు మధుర భాషిణీ-వాక్చాతుర్యమూ గల శ్రీమతి సరోజినీనాయుడును ఇరుపక్షాలనూ శాంత పరచటానికి పంపారు. ఆమె వచోమాధుర్యానికి హిందూమహమ్మదీయులు చల్లబడ్డారు. ఇది మరొక తార్కాణము.

ఆచార వ్యవహారాలలో స్త్రీలు చాలా పట్టుదల కలవారని మహాత్ముడు తన తల్లినీ భార్యనూ పరిశీలించి తెలుసుకున్నాడు. సాంఘికంగా ప్రజలు ముందుకు నడవాలంటే స్త్రీలనే ఉపయోగించాలని ఆయన అభిప్రాయము. ఈ కారణంచేత అంటరాని తనాన్ని నిర్మూలించటానికి వారిచేతనే ప్రచారం చేయించాడు.

సంఘమూ స్త్రీలూ కూడా విస్మరించిన స్త్రీల వ్యక్తిత్వాన్ని నిలబెట్టటానికి మహాత్ముడు దారి చూపాడు. "దుర్వ్యసనాల పాలయిన పెనిమిటిని కూడా భార్య మౌనముతో సహించి పాతివ్రత్యాన్ని నిలుపుకోవాలని అంతవరకూ సంఘము నమ్మింది. పెనిమిటి మీద ఎంత గౌరవమూ ప్రేమా ఉన్నప్పటికీ అతడు పెడమార్గాన పట్టినప్పుడు సరిదిద్దటానికి తగిన వ్యక్తి భార్య ఒక్కతే. ఆ బాధ్యత ఆమెదే. అంతమాత్రంచేత ఆమె పాతివ్రత్యానికి ఏ మాత్రం భంగం కలగదు" అంటూ బోధించిన వాడు మహాత్ముడు.

సంసారాలను ఆర్థికంగా కూల్చివేసే వరకట్నాల దురాచారాన్ని గురించి ముందుగా ఆయన స్త్రీలలోనే మార్పు రావలెనన్నాడు. "ప్రతి కన్యా ఎవరినో ఒకరిని ఈడూజోడూ కలవకపోయినా-ఎంత కట్న మయినా పెట్టి కొనుక్కోవాలని కక్కుర్తిపడి వివాహము చేసుకోనవస రము లేదు. పార్వతీదేవి భారతీయ కన్యలకు ఆదర్శము. ఆమె ఉగ్ర తపస్సుచేసి పరమేశ్వరుడిని భర్తగా పొందింది కాని కొనుక్కోలేదు కన్యలు అవివాహితులుగా ఉండి దేశసేవచేస్తూ నిగ్రహ శక్తిని అలవరచు కోవాలి" అని కన్యలకు ఉపదేశించాడు.

గాంధీ మహాత్ముడి కాలములో స్త్రీల పరిస్థితులు చాలా వరకు మెరుగయ్యాయి. స్త్రీలకు ప్రత్యేక పాఠశాలలూ కళాశాలలూ నెలకొల బడుతూ వచ్చాయి. గృహిణులలో సాంఘిక చైతన్యము, నవచైతన్యమ కలుగ నారంభించింది. భర్తలు చెరసాల శిక్ష లనుభవిస్తున్న కాలము బాలలూ వృద్ధులూ గల సంసారాలను అతి నైపుణ్యంతో నిర్వహించార రాట్నము మీద నూలు తీసి వస్త్రాలు నేయించుకొన్నారు. కొంద దానిని జీవనోపాధి చేసుకొన్నారు.

## స్వతంత్ర భారతంలో

దీని పర్యవసానంగా స్వతంత్ర భారతంలో స్త్రీలకు ఓటింగ్ అ కారము లభించింది. అప్పటికి ఏ దేశములోనూ స్త్రీలకు ఓటింగు అధి రము లభించలేదు. ఎన్నికలలో కొందరు గెలుపొందారు. శాసన సభ్ గాంధ్రయ్యారు. శ్రీమతి అమ్మన్నరాజాగారు డిప్యూటీ స్పీకరు పదవి ఎన్నికయ్యారు. క్రమంగా స్త్రీలు మంత్రి పదవులు,ముఖ్యమంత్రిపదవు ప్లానింగ్ కమిషను సభ్యురాండ్రు, గవర్నర్లు, ఎంబాసిడర్లు, యు.ఎన్.ఓ అధ్యక్షురాండ్రుగా పదవుల నాక్రమించారు.

స్వతంత్ర భారతంలో రాజ్యాంగ చట్టాన్ననుసరించి కుల, మత వర్ణ, వర్గ భేదము లేకుండా స్త్రీ పురుషులకు సమానావకాశాలు కల్పించ బడ్డాయి. ఉద్యోగావకాశాలు, విద్యా సౌకర్యాలు కూడా కల్పించ బడ్డాయి. అవివాహితలు మాత్రమే పాల్గొనవచ్చుననే పోటీ పరీక్షలలో (I.A.S. & I.P.S. )కూడా స్త్రీలు పాల్గొని నెగ్గారు. క్రమంగా వాటిలో వివాహితలకుకూడా అవకాశాలు లభించాయి.

భారతరత్న పండిత జవహర్‌లాల్‌నెహ్రూ భారత ప్రధానిగా ఉన్నకాలములో స్త్రీ జనాభ్యుదయం కొరకు మరికొన్ని పథకాలువేయబడి అమలులోకి వచ్చాయి. సోషల్‌వెల్‌ఫేర్ బోర్డు నెలకొల్పబడ్డది. దానికి శాఖలుగా ప్రతిరాష్ట్రంలోను ఏర్పడి, స్త్రీ విద్య, స్త్రీ సంక్షేమం మొదలయిన అభ్యుదయ కార్యక్రమాలు కొనసాగింపబడుతూ ఉన్నాయి.

## మార్పు చెందిన హిందూ స్త్రీల వారసత్వాధికారము

మానవధర్మశాస్త్రము సమాజోన్నతిని దక్షియందుంచుకొని ఏర్పడిన నిబంధనావళి. సమాజోన్నతి కాల పరిస్థితుల ననుసరించి ఉంటుంది. కాలపరిస్థితులకు అనుగుణ్యంగా న్యాయశాస్త్రములో మార్పులూ, చేర్పులూ జరగకపోతే అరాచకానికి విప్లవానికీ అవకాశమేర్పడుతుంది. మానవసంఘము ప్రాథమిక దశలో ఉన్నప్పటి ఆచారవ్యవహారాలూ కట్టుబాట్లూ ఆధునిక సమాజములో కాల ప్రభావాన్ననుసరించటము సహజము. సమాజపురోభివృద్ధికొరకు ఏర్పడిన న్యాయశాస్త్రము సంఘము యొక్క ఆదర్శ వ్యవహారాలనుబట్టి కొన్ని మార్పులకు లోనుగాపటము గానికి క్షేమకరము. ఈ మార్పులు వేదవిరుద్ధాలయినా అంగీకరించి వలసినదే. ఈ సూత్రాన్ననుసరించి 1937లో సంఘ సంస్కర్తలు ందరు న్యాయశాస్త్రములో కొన్ని మార్పులు చేయబూనుకున్నారు.

అప్పటివరకూ సమష్టికుటుంబములో వితంతువుకు మనోవర్తి మాత్రమే లభించేది; కాని ఈ మార్పు తరువాత విభక్త కుటుంబాలలో గాని, అవిభక్తకుటుంబాలలోగాని పెనిమిటి ఆస్తికి వితంతువు హక్కుదారురాలయింది. చనిపోయిన తన కుమారుని ఆస్తిని వితంతువైన తన కోడలికి, మనుమడిభార్యకు (వితంతువు) తండ్రి ఇవ్వవలసిన వాడైనాద ఇది కేవలము అనుభవానికి మాత్రమే.

అంతవరకూ ఎన్నిమార్పులు వచ్చినా ఇంటబుట్టిన కుమార్తె తండ్రి ఆస్తిపైన అధికారములేదు. ఆడపిల్ల పుట్టినప్పటినుండీ వివాహమయి అత్తవారింటికి వెళ్ళేవరకూ పోషించటమూ, కుటుంబ గౌరవానికి తగినట్టుగా వివాహము చేయడమూ, తండ్రికిగాని, అన్నదమ్ములకు బాధ్యత. తండ్రి చనిపోయినట్లయితే ఆడపిల్లల వివాహకార్యాలకు త

ఆర్థిక సదుపాయాలు చేసిన తరువాతనే అన్నదమ్ములకు ఆస్తి విభాగింప బడేది. కన్యకు జనకస్థానములో ఉన్న ఈ స్వల్ప అధికారాలు వివాహము కాగానే అత్తవారింట ఏర్పడేవి. వివాహములో సప్తపదిచర్యతో వధువు వరుని ఆధీనురాలవుతుంది. ఆ క్షణమునుండీ ఆమె గౌరవాధికారాలలో మార్పులు కలుగుతాయి.

పూర్వము మూడు తరాలవరకే ఆస్తిలో వారసత్వము ఉండేది. కర్మకాండలో మూడు తరాలవరకే పిండప్రదానము జరుగుతుంది. దీని ననుసరించి కర్త కుమారుడు, కొడుకు కొమారుడు, అతడి కుమారుడూ వారసులయేవారు. ఈ ము_రు వారసులూ లేనట్లయితే కర్త భార్య, తరువాత కుమార్తె అటు న పుత్రికాపుత్రుడూ వారసులయ్యేవారు. కర్తకు ఈ పై వారసులెవరూ లేనట్లయితే అతడి తల్లికి అధికారము ఏర్పడేది. తల్లితరువాత తండ్రికి లభించేది. తండ్రి తరువాత కర్త సోదరులకు లభించేది.

1929 యా ప్రకారము కర్త సోదరులతరువాత, వారికుమారులు, వారి తరువాత క తండ్రి తల్లికి, ఆమె తరువాత తండ్రితండ్రికీ, వారి తరువాత కుమారు కూతుళ్ళకూ, తరువాత సోదరికీ వారసత్వము లభించింది. ఈ యాక్టు ననుసరించి కర్త తాతవరకూ పైకిప్రాకిన వారసత్వము పైవారు లేనిపక్షమున కుమారుని కూతురివరకూ క్రిందికి దిగింది. తాతకూ తాత సహోదరులకూ మధ్యగా కొడుకు కూతురు, కూతురి కూతురు, వీరిద్దరి తరువాత సోదరికి వారసత్వము లభించింది.

మన ధర్మశాస్త్రము వివాహాలను ఎనిమిది విధాలుగా విభజించించి, ఈ వివాహాలన్నిటికీ ఒకే విధమైన శాస్త్రమూ సూత్రమూ అన్వయించదు. అగ్రజాతి పురుషుడు తక్కువజాతి స్త్రీ వివాహ మాడినట్లయితే ఆ వివాహాన్ని 'అనులోమ' వివాహమంటారు. దీనిని న్యాయశాస్త్రము అంగీకరించటం లేదు. కనుక 'స్పెషల్ మ్యారేజ్ ఏక్టు' క్రింద వివాహము చేసుకున్నట్లయితే చెల్లుతుంది.

'హిందూ లా'లో స్త్రీలకు ఆస్తిలో హక్కులేదు. భర్త ఆస్తిని ఆయన చనిపోయిన తరువాత కేవలము అనుభవించటానికేగాని దాన

విక్రయాధికారాలు లేవు. ఎంత గొప్పయింట బుట్టినా స్త్రీకి తండ్రిఆస్తిలో పీశమంత భాగములేదు. ఆర్థిక స్వాతంత్ర్యమూ అధికారమూలేని బ్రతుకు ఆధునికకాలములో ఎందుకు కొరగానిదై స్త్రీని అధమస్థితికి తెచ్చింది. వైవాహిక జీవితాలలో కలిగే ఒడిదుడుకులనూ నష్టాలన్నూ స్త్రీలే అనుభవించవలసిన వారైనారు. పుట్టింట, అత్తింట, ఇతరుల దయాధర్మభిక్షమున స్త్రీ జీవితము ఆధారపడి ఉన్నది.

ఈ రీతిలో 1941 జనవరిలో భారతప్రభుత్వము మితాక్షరీయంలో వితంతువుకు అధికారాలనూ, 1937 హిందూస్త్రీల ఆస్తి హక్కుల న్నీ పరిశీలించటానికి, తండ్రి ఆస్తిలో కుమార్తెకు అధికారాలను ంచటానికీ నియామకం చేసింది. 1941 జూన్‌నెలలో ఆ కమిటీ గ్రంగా పరిశీలించి, హిందూ లా ను కొద్ది మార్పులతో సంస్కరించి నందువల్ల పెద్దలాభము కలగబోదనీ, హిందూ న్యాయశాస్త్రాన్ని సమగ్రంగా నిర్వచించి క్రోడీకరణము చేయవలసినదనీ సలహాయిచ్చింది. ననుసరించి ప్రభుత్వము తిరిగి ఒక కమిటీని నియమించింది. ఈ టీ దేశమంతటా పర్యటించి పరిస్థితులను అవగాహన చేసుకుని, లోపాలను గమనించి, హిందూ లాలో చేయవలసినమార్పులను సూచిస్తూ త్తుబిల్లునూ, ఒకరిపోర్టునూ ప్రభుత్వానికి 1947 ఫిబ్రవరినెలలో అందింంది. ఇది ఆగస్టునెల 1948లో పార్లమెంటుకు అందచేయబడ్డది.

హిందూ కోడ్‌బిల్లు రెండవ అధ్యాయములో వివాహాలను గురించిన సంస్కరణలు ఉన్నాయి. వివాహ తతంగాలు, రిజిస్ట్రేషను, సివిల్ య్యరేజి, వాజ్యాలమూ, ప్రమాణాలూ, సర్టిఫికెట్లను గురించిన వివరణ ఉన్నది. మూడవ అధ్యాయములో దాంపత్య వి. నము, దానికి కారణాలు, వాటిని నిరూపించవలసిన క్రమాలు, పునర్వివాహాలు బిడ్డల విచారణ మొదలైన అంశాలు వివరింప బడ్డాయి. నాలుగవ దానిలో దత్తత స్వీకారము, చట్టసమ్మతమైన దత్తత, దానికి తగిన అర్హత, అధికార నిషేధ విధానాలూ మొదలైన అంశాలు వివరించబడ్డాయి. ఆరవ అధ్యాయములో సమష్టికుటుంబ ఆస్తి, ఋణములను గురించి వివరించబడ్డది. ఏడవది స్త్రీ ధనాన్నిగురించీ, ఎనిమిదీ, తొమ్మిదీ వారసత్వాధికారాలను గురించీ, పదవ అధ్యాయములో స్త్రీల ఆస్తికి వారసత్వాధికారాన్నిగురించి వ్రాయబడినది.

హిందూకోడ్‌ను గురించి వాదోపవాదాలు జరిగిన తరువాత సెలెక్టు కమిటీ ఒక నివేదికను సమర్పించింది. ముఖ్యమైన కొన్ని మార్పులతో ఈ నివేదిక హిందూకోడ్‌లోని అభ్యుదయాశయాలను అమలు జరపటానికి అనువు కలిగించింది.

నూతన శాసనాన్ననుసరించి జన్మతః పుత్రులకు కుటుంబం ఆస్తిలో హక్కు ఉండదు. ఆస్తి హక్కుదారుడు అనగా కబ్రతికి ఉన్నంతవరకూ అతడికి తప్ప మరెవరికీ హక్కు ఉండదు. ఆ పిత్రార్జితమైనా స్వార్జితమైనా, ఆ ఆస్తిని కుటుంబమందరూకలిసి సష్టిగా సంపాదించినా, అది స్థిరాస్తిగాని, చరాస్తిగాని హక్కుదారుడి మరణశాసనము ప్రకారము చెల్లుతుంది. స్త్రీలకు సంక్రమించిన ఆస్తిపైన వారికి సర్వాధికారాలూ ఉంటాయి. స్త్రీల ఆస్తికి వారసుల క్రమము వేరు, పురుషుల ఆస్తికి వారసుల క్రమము వేరుగా నియామకమయినాయి.

స్త్రీలకు తండ్రి ఆస్తిలో సోదరునకు వచ్చినదానిలో సగమువంతు రావటమనే నిర్ణయం జరిగింది. పార్లమెంటు సభ్యులు, రాజ్యసభసభ్యులు కుమారునితోపాటు కుమార్తెకు భాగమివ్వటానికి ఒప్పుకోలేదు.

ఈ బిల్లు సవరించే సమయములో జరిగిన తర్జన భర్జనలు ఒక నిజాన్ని నిరూపించాయి. ప్రాచీన హిందూ ధర్మశాస్త్రాన్ని గురించి తెలుసుకోవటానికి న్యాయవాదులకు సంస్కృత భాషరాదు. సంస్కృత పండితులకు ఆ శాస్త్రాన్ని విప్పి విపులీకరించటానికి ఆంగ్లభాషరాదు. తుదకు జరిగినది స్త్రీ పురుషులలో అసమానత.

"నవభారతము ప్రాచీనభారతములో స్త్రీలనుభవించిన హక్కులకు తిరిగి ప్రసాదించటానికి కృషిచేయటము అభ్యుదయ లక్షణము. ప్రాచీన హిందూ ధర్మశాస్త్రము సరిగా అర్థము చేసుకుని అనుసరించినట్లయితే ప్రజల అవసరాలను తీర్చగలిగి ఉండేది. ఆ ధర్మశాస్త్రము రూపొందించబడిన కాలములో ప్రపంచములో ఏదేశము కూడా సమాజములో స్త్రీ జాతికి అంతటి గౌరవ ప్రపత్తిని కల్పించలేదు" అని 'ధర్మసూత్రాలు - స్త్రీలు' అన్న గ్రంథాన్ని ఆంగ్లభాషలో రచించి పేరు పొందిన శ్రీమతి శకుంతలారావు శాస్త్రి బలపరుస్తున్నారు.

19వ శతాబ్దములో మూడవ భాగము ప్రారంభమయే సరికి మరి కొంత అభివృద్ధి కనబడుతున్నది. బాలికలకు ప్రత్యేక పాఠశాలలూ, కళాశాలలూ అధికసంఖ్యలో నెలకొల్పబడటం జరిగింది. స్త్రీలు సాహిత్యంలో ప్రవేశం కలిగించుకుని కవయిత్రులుగా, రచయిత్రులుగా పేరు తెచ్చుకుంటున్నారు. 19వ శతాబ్దానికి పూర్వము కనకాభిషేకం చేయించుకున్న కవయిత్రులుండేవారు. ఈ శతాబ్దంలో సాహిత్యాఅకాడమీ అవార్డు లందుకున్న రచయిత్రులూ, పత్రికలవారు పెట్టిన పోటీలలో ప్రథమ ద్వితీయ బహుమతులందుకున్న రచయిత్రులూ, చలనచిత్రాలకు నవలలూ కథలూ వ్రాసే రచయిత్రులూ గృహలక్ష్మి కంకణాలను స్వీకరించిన రచయిత్రులు అధికసంఖ్యలో మనకు కనబడతారు. రాజ్యాంగచట్టము కల్పించిన అవకాశాలను ఉపయోగించుకుంటూ చాలామంది స్త్రీలు వైద్య విద్యాఉద్యోగరంగాలలో రాణకెక్కుతున్నారు. రాజకీయాలలో కూడా పైకి వస్తున్నారు. వారి కొరకు ప్రత్యేక స్థానాలు కేటాయింపబడ్డాయి.

ఆర్థికంగా సంసారాలను నాశనము చేసే వరకట్నాల నిషేధపు బిల్లు ఒకటి అయ్యదేవర కాళేశ్వరరావుగారు కృషిచేసి శాసనం చేయించారు. దాని ప్రకారం వివాహపు ఖర్చు రెండువేలకు మించకూడదు. మించినట్లయితే, కట్నము తీసుకున్నట్లయితే- ఇచ్చిన వారూ పుచ్చుకున్న వారూ శిక్షార్హులు.

ఇదంతా సింహావలోకనము చేస్తే స్త్రీలకేమి తక్కువ? వారికింకా ఏంకావాలి? అనిపిస్తుంది. ప్రాచీనకాలపు ఆదర్శము "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః' అక్షరాలా మన సమాజంలో ప్రతిబింబిస్తున్నదా? నారీలోకమింత పురోగమించిందా? స్త్రీలు ఉన్నతోద్యోగాలు చేయటం, అధిక సంఖ్యలో పట్టభద్రులూ, పోస్టుగ్రాడ్యుయేట్లూ పి.హెచ్.డీలు కావటం చూస్తే విదేశాలకంటె కూడా మన స్త్రీలు ఒక అడుగు ముందుకు వేశారా అని అనిపించక మానదు.

కాని - పట్టణాలలో నగరాలలో స్త్రీ జనాభివృద్ధి నాగరికుల వ మెరుపు మెరుపుగా కంటికి మిరుమిట్లు గొలుపుతూ ఘనంగా చెప్పుకోట ఉపయోగపడేది మాత్రమేనని ప్రతి సామాన్యుడికీ తెలిసిన విషయ ఈ అభివృద్ధి నూటికి నాలుగూ లేక ఐదువంతున జరిగిన అభివృద్ధి, పై

చెప్పటానికి ఎంత ఘనంగా ఉన్నదో అనుభవంలో అంత గగన కుసుమంగా ఉన్నదని చెప్పక తప్పదు.

నేటి సాంఘిక పరిస్థితులలో మధ్య తరగతి ప్రజానీకానికి ఆడపిల్ల పు ందనగానే ఇంకా - ఇప్పటికీ "అయ్యో!" అన్నట్టుగానే ఉన్నది. త కి ఇంట్లో చిన్నపనీ పెద్దపనీ చేసిపెట్టి 'పెళ్ళి కుదిరే వరకూ!' అని చ వుకుంటున్న ఆడపిల్లలకు తగిన సంబంధము దొరకటం లేదు. వరుడు నల్ల బజారులోగాని దొరకడు. చాటుమాటుగానూ బాహాటంగానూ కట్నాల సమస్య తల్లిదండ్రులను బాధిస్తూ, ఆడపిల్లలను అవమాన పరుస్తూనే ఉన్నది. చదువుకున్నందుకు తన కాళ్ళమీద తాను నిలబడ గలుగు తాననుకుని ఉద్యోగంచేస్తున్నా ఆ సంతృప్తి ఆడపిల్లకు మిగలటం లేదు. ఆమె సంపాదనకూ ఆమె డిగ్రీలకూ పెళ్ళి మార్కెట్‌లో విలువ లేదు. తల్లితండ్రులు కొందరు ఆడపిల్ల సంపాదన మీదనే ఆధారపడి పెళ్లి వాయిదాలేస్తున్నారు. ఈనాడు ఉద్యోగాలుచేసే స్త్రీలుకూడా మెడలో తాళి కట్టించుకోవటానికి నానా అగచాట్లూ పడుతున్నారు. ఆమె సుఖ సంతోషాలను తల్లిదండ్రులు గమనించటం లేదు. ఉద్యోగంచేసే భార్య మీద భర్తకు ఉండవలసిన గౌరవం ఉండటం చాలా అపురూపంగా ఉన్నది. చిన్న ఉద్యోగం చేసే పురుషుడికి కలిగే ఆత్మసంతృప్తి పెద్ద ఉద్యోగంచేసే స్త్రీకి కలగడం చాలా తక్కువగా ఉన్నది. ఈనాటికీ స్త్రీ పది మంది పురుషులు పనిచేసే ఆఫీసులో నిర్భయంగా పని చేయలేక పోతున్నది, తాను సంపాదించుకుంటూ కూడా స్త్రీ ఆర్థిక స్వాతంత్రాన్ని అనుభవించలేక పోతున్నది.

ఒక ప్రక్క స్త్రీల శారీరక సౌందర్యాన్ని తెరగా చూపి చిత్ర నిర్మాతలు లక్షలు సంపాదిస్తున్నారు. దిగువ తరగతి స్త్రీలకు మరొక రూపంలో సమస్యలు క్రుంగదీస్తూ ఉంటాయి. ఎంత నీతినియమాలతో జీవితం సాగించినా వైవాహిక జీవితంలో భద్రత లేదు. నీతిగా బ్రతికే హక్కు లేదు. త్రాగుబోతు భర్తలతో సంసారంలో సుఖమూ శాంతీలేదు. కార్మిక స్త్రీలకు సమాన వేతనాలు లభించటానికి శాసనము వచ్చింది కాని ప్రసవానికిగాను తీసుకున్న సెలవులో నిండు జీతం లేదు.

ఇలాంటి సమస్యలెన్నో కొన్నాళ్లుగా మన సంఘంలో స్త్రీలను
ిధిస్తున్నాయి. చదువుగాని - ధనంగాని - ఉద్యోగంగాని - వివేకంగాని
ని సంఘం యొక్క పక్షపాత బుద్ధినుండి రక్షించగలుగుతున్నదా?
ట్టాలవల్లగాని - సూక్తులవల్లగాని - ఉపన్యాసాల వల్లగాని దేశంలో
ంమికంగా స్త్రీల పరిస్థితి ఎంత మేరకు మెరుగయింది?

దీని కంతకూ ప్రధానమైన కారణం ఒకటే!

స్త్రీ అంటే ఎవరు?

సంఘం ఏమనుకుంటున్నది?

"స్త్రీ అంటే బలహీనురాలు - అబల, పురుషుడికి భోగ్యవస్తువు,
జాతి-అదొక కులం-అదొక వర్గం అదొక మతం" అనుకుంటోంది.

కనుకనే ఆమె మంచిచె లూ, ఆమె అభివృద్ధీ, ఆమె కష్టసుఖాలూ
పు సానుభూతిని పొంద పోతున్నాయి. అబల కనుక ఆమెను
ాలను కుంటుంది, భో. వస్తు కనుక ఆ దృష్టితోనే చూడాలను
ంది; వెక్కిరిస్తుంది; హేళన చే ంది; సమయం దొరికితే పతనం
ె. ఆమెను ఎరచేసి డబ్బు సం దిస్తుంది.

ఎందుకు?

స్త్రీ ఎవరో ననుకుంటున్నది కనుక.

ఈనాడు స్త్రీ పురుష సంబంధం మిల్లు యజమానులకూ కార్మిక
ానికి మధ్య ఉన్నటువంటిదా?

పాలకులకూ పాలితులకూ మధ్య ఉన్నటు వంటిదా?

బలవంతుడికీ బలహీనుడికీ మధ్య ఉన్న భేదమా?

జ్ఞానికీ అజ్ఞానికీ మధ్య ఉన్న తేడానా?

అంతా అయోమయం. పితృస్వామ్యం పోయి మాతృస్వామ్యం
కాని స్త్రీజాతికి మోక్షం లేదంటున్నారు కొందరు, స్త్రీ పురుషులు

కలిస్తేనే కాని సంఘంకాదు. గృహానికి స్త్రీ పురుషులు సమానహోదాగల యజమానులు, వారిద్దరి సమష్టిజీవనమే దాంపత్యానికి మూలము; సంఘానికి పునాది. స్త్రీ గౌరవము - పరువు - ప్రతి - అభివృద్ధి - విజ్ఞానము - వివేకము పురుషుడికి కూడా చెందుతాయి. అంటే సంఘానికి చెందుతాయన్నమాట, ఆమెకు అగౌరవము జరిగితే పురుషుడికీ తద్వా సంఘానికి చెందుతుంది. ఆమెకు అపకీర్తి - అప్రతిష్ఠా కలిగితే అ తిరిగి తిరిగి పురుషుడికే చెందుతాయి.

స్త్రీ అంటే తల్లి - భార్య - కుమార్తె.

ఈ విధంగా ఆలోచిస్తేనే గాని స్త్రీ అంటే ఎవరో తెలియదు.

సంఘం యొక్క ఆలోచనా సరళి ఈవిధంగా ఉన్నందువ స్త్రీలలో (కొందరిలో) కొంత మార్పు రావటం మొదలు పెట్టింది. క కసీ ఎక్కువయ్యాయి. పురుష తిరస్కారము, దూషణా, కించపర వ్రాతలూ, మాటలు ఆరంభమయ్యాయి. క్షీరనీర న్యాయంగా వ్రాతు వలసి స్త్రీ పురు లమధ్య ఆలోచనా సరళి- మర్యాదా మా ఱ ధృవా తర ంతో సా. తూ వస్తున్నాయి. ఇంకా ముందడుగు సిన స్త్రీ "పురు డు తప్పు స్తే స్త్రీ క్షమించటం లేదా? పురుషుడు సిన తప్ మేమెందుకు చేయకూడదు?" అని ప్రశ్నిస్తున్నారు. పురుషులను మార్ టానికిచేసే రచనలూ ప్రయత్నాలూ కంటె తాముకూడా తప్పులు చేం టానికి అధికారం కావాలని ఆందోళన చేస్తున్నారు కొందరు.

పరస్పర హేళనలూ వెక్కిరింతలూ పర్యవసానమయ్యాయి స్త్రీలకు హక్కులూ చట్టాలూ సమగ్రంగా లభించకపూర్వం "స్త్రీ పూజించాలి, గౌరవించాలి" అనే సంప్రదాయం ఉండేది. వారసత్వ హక్కు లేక పోయినా కుటుంబంలో స్త్రీని అనేక విధాలుగా ధన కన వస్తువాహనాలతో - పసుపు కుంకుమలతో, ఫల పుష్ప తాంబూలాలత సాగనంపే సంప్రదాయ ముండేది. పగవాడి భార్య ఇంటికి వచ్చి సగౌరవంగా సాగనంపే ఆచారమూ రక్షణా ఉండేది, బద్ధవైరం పు షుల మధ్యనేగాని స్త్రీలపట్ల చూపేవారు కారు. స్త్రీని తల్లిగా, సోదరిగా కుమార్తెగా చూసుకునేవారు.

ఇప్పుడంతా తారుమయింది. స్త్రీ ఉంటేగాని సృష్టి జరగదు. నవ
సాలూ మోసి, కని, స్తన్యమచ్చి పెంచేది స్త్రీ. పురుషుడి ఇహ పర
ఖాలకు ఆట పట్టయి-అతడి ప్రశాంత జీవితానికి మూలమయినది స్త్రీ.
మెవల్ల తనను తాను ఉత్తేజపరచుకునేది పురుషుడు. పురుషుడిలో అర్ధ
భాగము స్త్రీ. వారిద్దరూ విడివడి ప్రత్యేకంగా అభ్యుదయం సాధించాలంటే
అది సమగ్రమయిన ఆలోచనకాదు. విడివిడిగా అభ్యుదయాలు సాధించినా
సహజీవనములో ఉన్నంత ప్రశాంతత కలుగదు. కనుక అభివృద్ధి మార్గాలు
సమిష్టిగా జరగాలి.

దీనికంతకూ మన సమాజము యొక్క ఆలోచనా సరళి మారాలి.
స్త్రీ కుటుంబానికి సంఘానికి జీవగర్ర-ప్రాణవాయువు. ఆమెను గౌరవించి
గౌరవము పొందాలన్న భావం సమాజంలో సంస్కారభావాలు సహజంగా
ఉత్పన్నంకావాలి. మనసులో సంస్కారం లేక పోయిన తరువాత ఎన్ని
చట్టాలు వచ్చినా, శాసనాలు వచ్చినా ప్రయోజనం లేదు. మేధావులూ,
రచయితలూ, సంఘసంస్కర్తలూ, రాజకీయవేత్తలూ ఈ సత్యాన్ని
గ్రహించాలి.

ఈనాడు మనం ఎక్కడచూసినా ఎక్కడ విన్నా "భావసమైక్యత,
తీయ సమైక్యత" అనే గంభీరమైన పదాలు వింటున్నాము; వాడు
న్నాము; ప్రబోధం చేస్తున్నాము. వీటివల్ల సర్వజనులకూ సుఖ
ంతులు కలుగుతాయని అందరూ ముక్తకంఠాలతో చాటుతున్నారు;
కాంక్షిస్తున్నారు.

కాని - ఈభావసమైక్యత అన్నది ఎక్కడ నుండి ఉద్భవించాలి?
మన సంస్కృతీబాల ఋష్యాశ్రమాలలో పెరిగి పెద్దదైనదని అను
వజ్ఞులు అంటున్నారు. మరిదీనికి పాదు ఎక్కడ? కుదురు ఏది?

## ఒకరినొకరు గౌరవించుకోవాలి

భావసమైక్యతకు ఒకరి కష్టసుఖాలు ఒకరు అర్థం చేసుకోవాలి
ఒకరికొకరు సహాయసానుభూతులు అందించుకోవాలి. ఒకరి సుఖసంతో
షాలను మరొకరు కాంక్షించాలి. ఇటువంటి భావసమైక్యత మొట్టమొద
దంపతులలో - స్త్రీ పురుషుల మధ్య జనించాలి. ఆ తరువాత సం

మంతా - దేశమంతా మల్లెపందిరిలా సువాసనలు విరజిమ్ముతూ
పాకిపోవాలి.

పురుషుడికి తన సంసారములో తన తల్లి - తన భార
కుమార్తె పట్ల కలగని భావసమైక్యత మరెక్కడా కలగదు. వ
వైశాల్యమూ సంస్కారమూలేని చదువులతో డిగ్రీలతో సమాజమ
గ్యవంతంగా ఉండలేదు. అనారోగ్య సమాజంలో స్త్రీ పురుషులు
గానే ఉంటారు. ఆరోగ్యకరమైన సంతానం కలగటం దుర్లభమవు

తానొక్కడూ విద్యావంతుడై - అభివృద్ధి చెందుతూ లోక
తనవలెనే ఉన్నదనుకునే పురుషుడు తన ఆలోచనా సరళిని స
రించుకుని - స్త్రీనికూడా కలుపుకొని ముందుకు సాగిననాడే మా
నిజమైన అభివృద్ధి. ఒక్క పురుషుడి అభివృద్ధి అది ఒక అభివృద్ధి
అవిధంగానే స్త్రీ తనకు అధికారాలూ-గౌరవమూ చట్టాలద్వారా
దించాలనీ మాతృస్వామ్యం రావాలనీ ఆందోళనచేసి సంపాదించిన అ
అసమగ్రమవుతుంది. స్త్రీ పురుషులిద్దరూ సామరస్యంతో సవి
సాధించిన అభివృద్ధే సర్వతోముఖమైన అభివృద్ధి. అది భావిత
అమృతం కాగలదు.



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి

గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరులుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండే దాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగు తల్లీ.

శంకరంబాడి సుందరా